

వేమన గ్రంథ మండలి.

ప్రథమ పుష్పము 1

# కలికాలవేదాంతము.

గ్రంథకర్త

ఆరుమళ్ల సుబ్బారెడ్డి



తెలప్రోలు వేమనాశ్రమము

కృష్ణా జిల్లా.

వెల రు 1—0—0

# సమర్పణము

---

సీ॥ బాల్యమాదిగ నన్ను • బాలించి లాలించి
ప్రేమ బెంచిన యట్టి • పెంపు జనని
బాల్యంబుననె తండ్రి • పరలోకమునకేగ
విద్య నేర్పించిన • వేదమాత
పసితనంబున జూపు • భవ్యప్రేమంబును
నేటికిన్ [illegible]ని • నిల్పు తల్లి
కల ధనంబుల నెల్ల • గ్రంథాభివృద్ధి
కర్పించినట్టి • [illegible]ల చరిత
గీ॥ యైన శ్రీరంగమ్మాంబ పా • దాబ్జములకు
నమల హృదయారవిందుడ • నగుచు దీని
భక్తిపూర్వకముగ సమ • ర్పణము జేతు
కన్న ఋణమింత దీర్పగో • గలుగుటకును.

వేమనాశ్రమము,
28—2—35.

ఇట్లు,
ఆడుమల్లి సుబ్బారెడ్డి,
గ్రంథకర్త,
తేప్రోలు.

ప్రథమ పుష్పము
వేమనగ్రంథమండలి.

# విజ్ఞప్తి

---

సత్యమార్గాన్వేషులగు ఆంధ్రసోదర సోదరీమణులారా; వర్తమాన ప్రపంచమునందు, బూటకపుగురుబోధలు ప్రబలి, గ్రామ గ్రామమున, కల్లగురువులు బయలుదేరినది మీకెల్ల తెలిసినవిషయమే, అట్టి బూటకనాటకుల అసత్యబోధల ఖండించుచు, పలువురు మహాత్ములనేక గ్రంథము లిదివరకే ప్రకటించియున్నారు.

కాని ఈకల్లగురువులు వారిదుష్ప్రవర్తనలు మార్చుకొన్నటుల గాని ప్రజలా యసత్యగురువుల భావములు పూర్ణముగా గ్రహించి నట్లుగాని కనుపించదు.

నేనును మొదట ఇట్టిబూటకగురువుల, ననేకుల దర్శించియు, వారలచే ఉపదేశపరిపూర్ణముల బొందియు, వారిపజ్జనే నెలలపర్యంతము నివసించియు, వారిమోసముల గ్రహించి, ఈ యసత్యబోధల నిర్మూలింపజేయు సంకల్పముతో, శ్రీ వేమనాశ్రమము నాస్వగ్రామమగు, జేలప్రోలునకు కొంతదూరములో, 1934 సంవత్సరములో నెలకొల్పితిని. నిష్కల్మషమగు ప్రజాసేవయే భగవంతునిసేవయనియు, నిష్కామకర్మచే గృహస్థాశ్రమధర్మముల నెరవేర్చుటయే మానవుని యొక్క ముఖ్యకర్తవ్యమనియు, గురూపదేశములను బొందితిననుదాని నాధారముజేసుకొని అడ్డమైనవారి పాదపూజలుజేయుటకంటె అగ్నిసాక్షిగస్వీకరించిన భర్తపూజయే స్త్రీలకు కర్తవ్యమనియు, మానవునకు భగవత్పూజ విధిగా యెట్లుచేయవలెనో అట్లే కర్మయు విధిగా జేయవలెననియు ప్రచారముజేసి, పైవిషయముల ప్రజలకు బోధించుటయే ఆశ్రమధర్మముగా నిర్మించుకొని నాకర్తవ్యమును నెరవేర్చుకొనుచుండ, విద్యాలోపముగలవాడనయ్యును, శ్రీ వేమనార్యుల ప్రబో

ధముచే, నీ కలికాల వేదాంతమను దృశ్యప్రబంధమును వ్రాయ సాహసించితిని. నాయీ సాహసమును పండితులు మన్నింతురుగాక.

పండితులైనవారు ఇట్టి దొంగగురువుల మోసముల బడకున్నను పామరజనులనుమాత్రము యీగురువులు ఎక్కువగా నాకర్షించుచున్నారు. ఈ గురుశిష్యుల అంతరంగిక మోసము ననుభవముగా గ్రహించియు, స్వయముగా జూచియు, నాభావనను ప్రకటించి, ప్రజలిట్టి దంభగురువుల జేరకుండుటకై వ్రాయబడినది. గాని విద్యాబలముచేగాదు. ఈ గ్రంథమును విద్యావ్యాప్తితోగాంచిన అనేకతప్పులుండవచ్చును. కాబట్టి విద్యావ్యాప్తితోగాక నాయుద్దేశ్యములలో తప్పొప్పులమాత్రము గ్రహించి, సత్యమైన సంఘోద్ధరణవ్యాప్తిలో నా సవరణల నాకు దెలియపర్చువా రెట్టివారైనను, నేను సవినయముగా రెండవకూర్పులో సవరించుకొందునని హృదయపూర్వకముగా మనవి జేయుచున్నాను.

నా యీ దృశ్యప్రబంధము నామూలాగ్రముగా గాంచి నాపై నిర్వ్యాజప్రేమచే నిందలి పద్యములలో యతి, గణ, దోషలను సవరణ జేయుటయేగాక ఈ గ్రంథమునకు నాందియు వ్రాసి యిచ్చిన కపిలేశ్వరపుర శాస్త్రవ్యులును, బహుగ్రంథ కర్తలును నైన మ॥ రా॥ రా॥ శ్రీ విద్యాశేఖర్ దింటకుర్తి భాస్కరకవిగారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతు లర్పించుచున్నాను.

వేసనా [illegible]. వేమన గ్రంథమందలి [illegible]నునది స్థాపించి అందుకై యిట్టి సంఘ[illegible]చారములు ఖండించు పుస్తకముల ప్రకటించు నుద్దేశ్యముతో నే నీగ్రంథమును రచించితిని. నేనీ గ్రంథమును రచించితినని విన్నంతనే ఈ గ్రంథ మచ్చువేయించుమని ప్రేరేపించి తన సహాయమును సక్రమముగ [illegible] నాకు చేయూతనిచ్చిన మ॥ రా॥ శ్రీ వింత [illegible]రెడ్డిగారికిని, ఈ గ్రంథమందలికి, పూర్ణసహాయము జేయ కుడిభుజము వలెనున్న వేనువ గ్రంథాలయ

స్థాపకులగు, మ॥ రా॥ శ్రీ గుంటక కోటిరెడ్డి గారికిని, ఈ వేమనాశ్రమాభివృద్ధికి, వేమన గ్రంథ మండలికిని వేమన జయంతులకును, పూర్ణముగా ఆర్థసహాయముల జేసిన చేయుచున్న చేయనున్న తేలప్రోలు గ్రామవాసులకును తదితరులకును నా మనఃపూర్వక వందనము లర్పించుచున్నాను.

సద్గుణాహ్వానములగు నో సోదర సోదరీమణులారా! మీ రెల్లరును, ఈమహా వేదాంతిగురువులను బదపుళేటుగులకు సింహస్వప్నమో యనునట్లు స్థాపించ బడినట్టి శ్రీ వేమనాశ్రమాభివృద్ధికై సహాయము జేయుచు, శ్రీ సంవత్సరము చైత్ర శుద్ధ నవమినాడు ఈయాశ్రమమున నాచే వైభవముగా జరుపబడు వేమనజయంతియందు పాల్గొనియు పూర్ణజ్ఞాన పరిపోషకుడగు శ్రీ వేమనయోగి సార్వభౌముని దివ్యబోధలసారమును గ్రహించియు మీ మీ గ్రామములలో నున్న నీదంభగురు సంఘముల నశింపజేసి వేమనయోగిచే చెప్పబడిన సూత్రముల ఆదర్శములతో ప్రవర్తించుచు శ్రీ ప్రజాసేవా సంఘముల స్థాపింతురను నమ్మకముతో నీ గ్రంథము రచించితిని. ఈ గ్రంథము చదువుటతోడనే తృప్తిపడక మీ గ్రామ దొంగగురు సంఘముల నశింపజేసి సత్సంఘముల స్థాపించి యీ దృశ్యప్రబంధ రచనము సార్థకము జేసెదరుగాక యని సవినయముగా మనవి జేయుచున్నాను.

ఇట్లు,
గ్రంథకర్త,
ఆరుమళ్ల సుబ్బారెడ్డి,
తేలప్రోలు.

వేమనాశ్రమము
ది. 28—2—1935



# ఇందు వచ్చు పాత్రలు

—: పురుషులు. :—

1 జయదేవుడు—(సాత్త్విక గృహస్థు)
2 వేంకటరావు—(చౌదరికి దుర్మార్గ కథానాయకుడు)
3 చౌదరి—(అన్యాయిక గృహస్థు)
4 గురువు (మాయవేదాంతి)
5 రంగారావు—(దొంగశిష్యుడు)
6 ప్రసాదరావు—(వేంకటరావు హితుడు)
7 మోహనరావు—(ఒక విలాసపురుషుడు)
8 యోగి—(ఆశ్రమాధిపతి)
9 నిరంజనరావు—(ముద్దాయిల ప్లీడరు)
10 బలరామయ్య—(సాక్షి)
11 నర్సుడు—(జయదేవుని సేవకుడు)

—: స్త్రీలు. :—

1 తులసీదేవి—(జయదేవు భార్య)
2 నాగమణి—(చౌదరిభార్య)
3 కనకమ్మ—(గురువు భార్య)
4 లక్ష్మమ్మ } (విధవరాండ్రు గురుబిడ్డలు)
5 గంగమ్మ }

సమయానుకూలముగా మరికొందరు ఆఫీసర్లు, జవాను, కోర్టు అమీనా, యాచకులు, న్యాయాధిపతి మొదలగువారు వత్తురు.



# కలికాల వేదాంతము



## నాంది

మదనంతకోటి సర ♦ సీజ భవాండములందునిండి, తే
జోమయమ్మై వెలుంగుచును ♦ చోద్యముగా గనుపట్టుచుండునో
నామహనీయమూర్తిని ద ♦ యామయు జూడగ లేక మూఢులై
నీమముదప్పి వర్తిలెడి ♦ నీచుల దైవము మార్చ్యగా వుతన్.

( నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించును. )

సూత్రధారుడు:— నేనప్పుడే కలికాల వేదాంత నాటకమునకు పాత్రల సంసిద్ధము జేయుమని జెప్పినను, నటుండింక నాలస్యము జేయుటకు కారణమేమి.

( ప్రవేశము నటుడు)

నటుడు:— ఆర్యా! ఆటంకమేమియు లేదు. పాత్రల నిదివరకే సంసిద్ధమొనర్చి తమకొరకు నిరీక్షించుచుండ మీర లగుపడరైతిరి.

సూత్ర:— అదియా కారణము. నటు లే కవి ఈ కలికాల వేదాంతము రచించిరని యడుగగా వారల కామహనీయుని చరితంబును గూర్చి ప్రస్తావించుచుంటిని.

నటు:— ఆర్యా! అడుగ మరచితిని. ఈ దృశ్యప్రబంధమునకు కర్త లెవరో నేనును విన కౌతూహల పడుచుంటిని.

సూత్ర— అయితే వినుము.

సీ॥ గ్రామోన్నతికి పాటు ♦ గావింపవలెనంచు
పాఠశాలలను నే♦ర్పరచె నెవడు

పతితసంఘీయముల్ ♦ బాగుచేయగ నెంచి
భూరికష్టము ధార ♦ బోయు నెవడు
గాంధియాదేశంబు ♦ గమనించిధీరుడై
కారాగృహంబున ♦ కరిగె నెవడు
శుష్కవేదాంతుల ♦ సురిగింపగా నెంచి
వేమనాశ్రమము స్థా ♦ పించె నెవడు
గీ॥ అట్టి శ్రీయారుమళ్లవం ♦ శాబ్ధిచంద్రు
డైన శ్రీకోటిరెడ్డికి ♦ యను కృతుండు
డమలగుణసాంద్రుడైనను ♦ బ్రాబిధాను
డెలమి రచియించితల్లికి ♦ వేడ్క నిచ్చె
నంకితంబిలకవి రాజు ♦ లరసఖుడు॥

నటు— (పెదవి విరచును)

సూత్ర— ఏమట్లు తృణీకరముగా పెదవి విరచితివి?

నటు— చెప్పుమునెదవా? ప్రకృతియన నేమిరో తెలియుని బోలు డగు నీతని గ్రంథము ప్రకృతిరహస్య వేద్యులగు పెద్దల రంజింప జేయునాయని॥

సూత్ర— అదియా నీసంశయము ఐన సందేహింప నవసరము లేదు. వసితనమున నెన్నిటినో ప్రకృతిభోగముల వెగటు దోచునటు లనుభవించి, మహాత్ముని దేశారాధనము సాంచజన్య ధ్వని విని, యేహ్యభోగముల త్యజించి కారాగారమున కేగి తిరిగి వచ్చిన వెంటనే అనేకాశ్రమ గురువులను, అచల గురువులను గాంచి వారి దుష్ప్రవర్తనల ననుభవ పూర్వకముగా నర్థము జేసుకొనియే నీ నాటకము రచించిరి. అదుగో సద్గృహస్థాశ్రమ సద్విధానపాల నాచాతురీధురీణులగు జయదేవులు యేదియో నాలోచింపుచుండిరి. మనమావలి కేగి మాటలాడుకొందము రండు.

సూత్ర— సరియే నీవు ముందునడువుము.

---

# కలికాల వేదాంతము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము.

జయదేవుని గృహము.

(జయదేవుడు కూర్చొని ఆలోచించుచుండును. తెర లేచును.)

జయదేవుడు—— సత్యమేయగుగాక, కాని భగవానునిచే నిర్మించబడిన ఈ ప్రకృతి గుణములు క్షణక్షణమునకును మారుచుండును. కాని సత్యము, అహింస, బ్రహ్మచర్యము నను నీ ప్రధాన విషయము లెన్నటికిని మారజాలవు. మార్చనూజాలరు. ఈ ప్రకృతి గుణములు ఒక కాలమునకు మంచివిగా నుండి వేరొక కాలమునకు చెడుగా మారవచ్చును. పూర్వకాల పరిస్థితులకును, నేటి పరిస్థితులకును తారతమ్య మాలోచించిన హాస్తిమశ కాంతరమున్నది. అందు ముఖ్యముగా నీ గృహస్థధర్మములు తారుమారైనవి.

సీ॥ బాల్యవివాహముల్ ♦ ప్రబలంబులైపోయి
బ్రహ్మచర్యంబిల ♦ పాడువడియె
పతిభక్తిశూన్యమై ♦ సతిచరించుటచేత
గృహధర్మములవెల్ల ♦ గూలిపోయె

యేకపత్నీవ్రతం ♦ బిలనశించుటచేత
సతులమహాత్వముల్ ♦ సడలిపోయె
అన్యభాషాచార ♦ మనుసరించుటచేత
మాతృభాషలునేడు ♦ మంటగలిసె
గీ॥ భర్తయేదైవమనుమాట ♦ మరచినేడు
వెధవలగుశుష్కవేదాంత ♦ వేత్తలకును
పాదపూజలుజేయుట ♦ ప్రబలిపోయె
కాలమహిమంబులెవ్వరు ♦ గాంచగలరు?

కాలపరిమాణ మిట్టి యొడుదుడుకులు గానున్న యీ సమయమున నే, పసిపాపలనెత్తిపై పవిత్రమగు గృహభారము పడుటవలన గృహస్థ ధర్మములన నేమియో తెలియక తికమకలు పడుచున్న నీ సమయముననే గురుసాంప్రదాయమను, వేరు పురుగొకటి ప్రవేశించి గృహస్థుల మరింత కూలద్రోయుచున్నది. ఈ ప్రకృతి గుణ ప్రవర్తనములు చివరి కేరూపుదాల్చుట కీవిధమున ప్రవర్తిల్లుచున్నవో యాపరమేశ్వరునకే గోచరింపవలయును.(ఆలోచన)

(తులసీదేవి భాగవతముపట్టుకొని ప్రవేశించును)

తులసీదేవి— ఇంక పురాణపఠన కుపక్రమింతమా?

జయ— ప్రారంభింతముగాని వేంకటరావు ఇంకను రాకుండుటకు గతంబేమియో.

తులశి— పాపమా చొదరిపాలిట మృత్యుదేవతవలె ఈనాగమణిరొకటిదాపురించినది. అందుచేతనే పాపమా చొదరి కుమారుడైన వెంకటరావునకా నాగమణిచే కష్టములుగాంచక తప్పనదికాదు.

జయ— తులసీ; చొదరి పూర్వకాలపు వాడగుటచే పుత్రునకు సౌఖ్యము గలుగునను భ్రమచే నాగమణిని ద్వితీయ వివాహము జేసుకొని మరింత సుడిగుండమున బడిపోయినాడు.

(తెరలో రాగమువినబడును ఆలకింపుచుందురు.)

ప— నిరితమునీపదంబులను ♦ నెమ్మిభజింపుచు దేవదేవ స
 త్వరముగ బంధమోచనము ♦ వాసిగగావలె నంచువేడ, సౌ

వరద దయామయా భవద ♦ వారణదర్శన భాగ్యమిచ్చినన్
కరుణను గానవేడెదను ♦ కంసవిదారణ వంశధారణా

జయ— అదుగో వేంకటరావు వచ్చుచున్నాడు. (ప్రవేశించును)

తులసి— అబ్బాయీ నేడేల పురాణమునకు కాలస్యముగా వచ్చితివి.

వేం— అమ్మా! మాయింటగల పరిస్థితు లన్నియు మీకు తెలిసియున్నవేగదా.

తుల— నేడేమైన కలహము సంభవించినదా యేమి?

వేం— మా చక్కదల్లిపై కలహము చేయ వచ్చునంతటి ధైర్యవంతు డెవరు? ఆమెకీ మధ్య మాగ్రామములోనున్న లక్ష్మమ్మ యను వేదాంతురాలితో స్నేహము కుదిరినది. నాటినుండియు ఆ లక్ష్మమ్మ గురూపదేశ మొందవలసినదని పురెక్కించుచుండగా నేటికామె తలకెక్కి మా నాయనను గూడ నుపదేశ మొందవలసినదని బాధింపుచున్నది. నేనెట్టిన మాట్లాడుటకు నాతో మాట్లాడ్డనైన మాట్లాడదుగదా.

తుల— మాయింటికుమారునితో మాట్లాడక పోవుట సతికెల్లలకు సహజమే గాని, భగవంతునిబోలు భర్త యింటనుండ నుపదేశముల నెపమున పరపురుషుల పాదసేవ జేయు బుద్ధులేల?

జయ— అదేమిమాట, ఈయుపదేశము నెపమున గ్రామముల బటుకతిరుగు వెఱ్ఱులు కూరుటకుకుఱ్ఱల ననేల భర్తలనే ప్రేమించరు?

సీ॥ భర్తసంపాదించు ♦ భాగ్యమెల్లను తాను
వెచ్చించుచుండెడి ♦ చెలదులకును
ధవుని మోమొకసారి ♦ దర్శింపనొల్లక
దంభగురువుల కూడు ♦ తరుణులకును
కాంతునాజ్ఞను మీరి ♦ కాపురంబొల్లక
పశువులైవర్తించు ♦ పడతులకును
పతియొక్కమాటగ ♦ భోజనమూటాడ
గోతినూతికి బోరు ♦ నాతులకును

గీ॥ మూర్ఖవనితలకునుదప్ప భూమిలోన
మారుకుట్టిలజూచెడి • వారులేర
సహజమంచునుబల్కెడు • చాటుచాటు
సహజమూత్రోధమిలలోన • స్త్రీలకబల!

తుల— భాగవతములో నేను మానము ప్రారంభించు ఘట్టమునందును, ఈ విషయమే చర్చించబడియున్నది.

(పుస్తకము విప్పి చదువుచు)

కం॥ ఉపవాసంబులు వ్రతములు
దపములు వేయేల భర్త • దైవతమని ని
ష్కపటతగొల్చిన సాధ్వికి
నృపవర దుర్లభము లేదు • నిఖిలజగములనో॥

వేంకట— ఓహో! యేమిపద్యము. ఈ పద్యమునొక్కసారి మా మారుదల్లికి విన్పించిన నామెకు హృదయపరివర్తన మగునేమో?

జయ— పిచ్చివాడా, నీతి దెలియక చెడుగావర్తించుచుండి రనుకొనుట పొరపాటు. వారి అనుకూల పరిస్థితులను బట్టియు, అహంకారము చేతను. విచ్చలవిడిగా చరించుచుండుట దప్ప నీతి దెలియక మాత్రముగాదు (కొంచెమాగి) వేంకటరావూ, నేనిప్పుడే పొలములోనికి వెళ్లవలసినపని యున్నదిగాన ఈ దినమున కింతవట్టునకు విరమింతము.

వేంక— అయ్యా! భగవత్ కాలక్షేపము జరుగు నీసమయమున, పనులకై యీ పరితాపమేల?

జయ— అదిగో అదియే మనము దెలిసికొనవలసిన సూత్రము. కొంచముగా జ్ఞానమిట్టదని విన్నంతనే నాయంత యనుభవసీయుడెచ్చటను లేడని విర్రవీగుచు వారికిదగిన దద్దమ్మలను కొందరి శిష్యులనుగా జేర్చుకొని మఠమనియో, ఆశ్రమమనియో, ఒకభూత గృహమును నిర్మించుకొని దాని నెపమున ధనమును సంపాదించుచు, సోమరులై పనిపాటలుమాని మత్తువస్తువుల స్వీకరించుచు, పిచ్చిపిచ్చి తత్వముల బాడుచు, లోకమును అనేకులు మోసపుచ్చే

నాగమణి— నాగొంతుగోసి ముడిమినినన్నుగట్టుకొన్నదిచాలక. సవతిపిల్లల జూచుటలేదను వేరొకనిందమూ నానెత్తి గట్టుచుంటివి. (దుఃఖముతో) ఇట్టినిందలు మోసి బ్రతుకుటకంటె యే నూయో గోయో జూచుకొని తీరెదను. తరువాత నీతిప్పలు. (అను అర్ధోక్తిలో)

చౌదరి— ఉండుండుము. నేను మాటవరుస కన్నమాటకుయింత రాద్ధాంతమా! ఇన్నియేండ్లలా, ఈ పలితనమున నిన్నుగట్టుకొన్నందులకే లోలోన కుళ్ళుచున్నాను నీయనుమతినే వ్యవహరింపుచుంటినిగదా! ఇంక నన్నేగంగలో (అర్ధోక్తిలో)

నాగమణి— నాయనుమతియునగా, నేనేమియు చెడుపనులు జేయలేదే? మీకేమియు తలవంపులు దెచ్చిపెట్టలేదే, యొకులతో నొక్కమాటయైనను బడక, ముసలిదగ్గరైనను, యెంత యిల్లాలురా అనే అనిపించుకొనుచుంటినే, మిమ్మేమి కానిపని చేయమనుచుంటిని, ముక్తికోసమై గురూపదేశముండెదమని సంతులకా ఈ మాటలు. యెందరుపదేశమందుట లేదు, అందరు నిట్లేయనుచుండిరా? నిన్నగాక మొన్న నాలక్ష్మమ్మ యింటివద్ద అందరుపదేశమందిరి గదా, వారందరికంటె నీవు తెలివిగలవాడవా?

చౌదరి— ఓహో! యిదుకా యింత గందరగోళము. సరియికనేమి ఆ వెధవ లక్ష్మమ్మ నీకును పురెక్కించినదన్నమాట. అది విన్నదగ్గరనుండి నీకీ పూనకము వచ్చినది. (తలపంకించుచు) దానికేమి హద్దువిడిచినముండ. అడ్డము వచ్చువారులేరు. ఆస్తియూ మితిమీరియున్నది. చెప్పువారు లేరు. ఇక యిట్లు సాగించినది. వెనుకటివెల్లమరచి వేదాంతి యనిపించుకొనుటకు తాచెడ్డకోతి వనమెల్ల జెరచునను చందమున తనతోపాటు సద్గృహస్థులను చెరుపనున్నది. వీరందరిపై నాయకురాలనిపించుకొనుటకు దక్క. నేనెరుగనా ఈ లక్ష్మమ్మ వేదాంతమును, ఈమెయింటికి రోజునకొకరువచ్చు తిండిపదరుబోతు గురువులను, పోనీ ఈ లక్ష్మమ్మ యుపదేశమిప్పించిన మహాత్మురాండ్రలో పూర్వ దురాగతము

లను మార్చుకొన్నవారి నొక్కరిని చెప్పుము. ఇంతయేల! ముందు యీ లక్ష్మమ్మ సంగతి చేర్కొనుము. నోరెరుగని పశువులు బీట బడినందులకేగదా! నిన్న వారింట్లపైబడి కలహించినది. కారణమందినందులకే గదా యుదారత్వము! ఈ వేదాంతులమని తిరుగువారెల్ల రేవు గల్లబొల్లి వాక్యములు కొన్ని నేర్చి భర్తల యందిదివరకున్న యనురాగమును పూర్తిగా త్యజించి సిగ్గుమాలి తిరుగుట తప్ప ఫలితమేమి మొన్న వేంకటప్పయ్య బ్రహ్మయ్యతో తనభార్య పెట్టు యిబ్బందులు చెప్పగా బ్రహ్మయ్యవినివిని యింక నయం ఈ యిబ్బందులకు తోడు నీభార్యకూడ వేదాంతురాలు గాలేదు. మొన్న నాభార్యకు లక్ష్మమ్మ గురు కారణ మిప్పించినదట. అది మొదలు నేను వేళకు తిండిలేక మాడి చచ్చుచున్నాననెను. ఇట్లున్నది గురూపదేశముల మహిమ.

నాగ — సరి యిక నీవు చెప్పుచు కామెర్లు యినవానికి ప్రపంచమంతయు పచ్చనై కనుపించునట్లు యెక్కడదో యొక చాటువదీసి వేదాంతులనందరిని, హేళనజేయదలచితిరా? కారణమంది బాగుపడిన వారెందరుగలరు?

సీ॥ పిల్లికిబిచ్చంబు ♦ బెట్టనిలక్ష్మమ్మ
గురుశిష్యులకుకూడు ♦ గుడుపుచుండె
గడిదాటిరానట్టి ♦ శివకాంబ జంకక
నెచ్చోటసభలైన ♦ నేగుచుండె
అచ్చరం బెరుగని ♦ పిచ్చమ్మరచ్చలో
శాస్త్రచర్చలవెన్నొ ♦ సలుపుచుండె
మగనితో మాటాడ ♦ మానమూనెడుపద్మ
పదిమందిలోనైన ♦ బాడుచుండె
గీ॥ పొరుగుయింటికిబోనట్టి ♦ పొలతినేడు
దేశదేశాలనెల్లతా ♦ దిరుగుచుండె
మహిమగురువుల జేరిన ♦ మనుజులెల్ల
రిలను ప్రఖ్యాతిగనరె గ ♦ ణించిచూడ॥

నామాటనాదరించి మీరుగూడ నిందుల కంగీకరించిన సరె. లేకున్నను నామతిమిది. తప్పక నేనొక్కతెనైన నుపదేశమొందెదను. మీ యిష్టము నొక్క క్షణములో జెప్పుడు. మరల మంచిదినము కుదురుట కష్టము. (లోనికేగును.)

చౌదరి— ఈ యూరికీ లక్ష్మమ్మ యెచ్చట దాపురించినదిరా నాయనా! ఈ పింకె యీపట్టు విడువదు. వలదన్న నాగొంతు కోరుకక మానదు. ఇది నాయింట నడుగిడినది మొదలు హాయుమనిబొక్కెడు కూడైన గుడిచి యెరుగనుగదా! తల్లిలేని బిడ్డడైన వేంకటరావు పోషణభారము వహించుదనను భ్రాంతిచే దీనిని మెడదగిలించుకొని యిప్పటికే నానాకష్టములను లోనగుచుంటిని. యిక దీనితో గలసి గురూపదేశమునొంది వేదాంతులమని తిరుగుచు యెన్ని కష్టము లనుభవింపవలసి యున్నదో. భగవానుడా! నీదేభారము. ఇది యీపట్టువిడువదు. వీలులేదన్న నిదివరకు వడ్డింపకున్నను వంటయైనను చేసెడిది. ఇక మీరు చేయు గొల్పుకొన వలసివచ్చును. ఈ కాలమునకు దగినట్లు ఈగురువులెక్కడ దాపురించిరోగదా!

సీ॥ పతిసేవనిరతంబు • పారమార్థికమంచు
సేవించునవనితల • స్జిలదీసి
భార్యనర్థాంగిగా • భావించుపురుషుల
భావముల్ చెడగొట్టు • పాలుబడుచు
ఆశ్రమంబుల కర్థ • మార్జించిభోగాల
నందజూచెడిదొంగ • పందలిపుడు
గురువులైనారూర • కుక్కగొడుగులవలె
స్వైనవేలుందురం • చెన్నరేగగ
గీ॥ నయినచింతింపనేటికీ • యార్యభూమి
నాటినాటికిక్షీణించి • నేటికకట
దేశద్రోహులదొంగలౌ • దేశికులను
కనుచునున్నదియేమొయి • కాలమునకు

గాక యిప్పుడు నేను జేయదగిన దేమున్నది. చచ్చినట్లొప్పుకొను యే యుత్తమము. ఇప్పు డీ వేదాంతమున దిగుటకు చింతింప నేల? దీని నెప్పుడు నామెడకు గట్టుకొంటినో ఆనాడే తుదిలేని దుఃఖసాగరము న మునిగితిని. యిందులకు ప్రతికూలించిఫలమేమి. ఈయనుకూల మును చెవిగొట్టుకొనుటదప్ప దీనిమాటపై నుపదేశమునొందిన యనంతరమేని యనుకూలవతియగునేమో. ఓ దేవ దేవా ఈవిపత్సా గరమును, యేనాడుత్తరింప జేసెదవో గదా.

(నాగమణి వెనుకగా ప్రవేశించి) ఏనాడేమిటి, ఈనాడే; భగవంతుడు స్వయముగా మనయింటికివచ్చి మనల తరింపజేయును. భగవంతుడ న నెవరోగాదు. గురువేనట. మొన్నలక్ష్మమ్మమనయింటివద్ద తత్వా లుపాడుచు చెప్పినది.

॥ ధరణిలోపల నారారు తత్వములకు
నవ్వలై యున్నతత్వంబు నెవ్వడెఱుగు
శివుడు గురురూపమునవచ్చి చెప్పకున్న
నన్యతరభోగి శ్రీసదానందయోగి. అని

ఇందులకు నీ యుద్దేశమేమి. గురువుగారిదయ పూర్ణముగానుండి మనము పాదముపట్టినఘడియ మంచిదైనచో సంతానప్రాప్తియు సిద్ధించవచ్చును.

చౌదరి—(తనలో) ఇక నేమి దీనిని లక్ష్మమ్మ తనమాయలో పూర్ణ ముగా బడవైచుకొన్నది. ఇంకసందేహామా? పాటలు తత్వములు గూడ పాడుటకు ప్రారంభించినది. ఇకనావప్పుకోలు కేమాత్రమా లసించినను నాకుత్తుక కొరకకమానదు. (ప్రకాశముగ) సరి ఇంకని న్నతిక్రమించి నేనుమాత్రమేగంగలో గలసెదను గాని, ఇందుల కై నేనేమి చేయజాలయును.

నాగ—(సంతోషముతో మగనివద్ద కేజేరి లాలింపుచు) మీరుచేయ వలసిన దేమియులేదు. పొద్దుననే లక్ష్మమ్మచెప్పగా సర్వసామ గ్రియు సిద్ధపరచితిని. మీరు స్నానమాచరించి సంసిద్ధులుగ నుండుడు.

చౌదరి—(లేచిలోనికిబోవుచు) నేనేయిట్లు భార్యకువశీకృతుడనైతినని. చింతింపనేల ఈదుగడచిన వెనుక రెంటిపండ్లూడిన నాబోంట్లం దరకు ఈయువ స్త్రీపట్టునలసిన దే.

గీ॥ కడగి యాకాశమున యిల్లు • గట్టవచ్చు
భావిపడినట్టి జలబింబ • బట్టవచ్చు
పడుచుకోమరాలు రెండవ • భార్యయగుట
దాటినడువంగరాదు వి • భార్యకైన (లోపలికేగును)

నాగమణి—ఇక్కడకు వీడినొప్పించువరకు తలప్రాణముతోకకు వచ్చినది. గడసరి సామాన్యుడా. వేరుదారిలేక యొప్పుకొనెను గాని (పైకిజూచి) అదుగో! వెంకటరావు వచ్చుచున్నాడు. కార్యము సానుకూలపడువరకు, సవతితల్లివలెజూడక, ప్రేమతోజూచు చుండిన, వచ్చిన పలువురు గుణబిడ్డలలో మాతృకజ్ఞాతిప్రేమతో జూచుచున్నదనియు, భర్త అనుమతినేవర్తించుచున్నదనియు, పేరు గడింపవచ్చును. ఆపైనెట్లున్న మనల నడుగువారెవ్వరు? (వెంకటరావు ప్రవేశించును) అబ్బాయీ త్వరగా భోజనమునకు లెమ్ము. సురల ప్రొద్దుబోవును భోజనానంతరము విశ్రమించవచ్చును. (లోనికి బోవును)

వెంకట—ఏమి యాశ్చర్యము. అపూర్వసంఘటనము యెన్నడును, కలనైనతలువని కృత్యముజరిగినది ఇది కలయా? నిక్కువమా? స్వయముగా వినుచుండ కలయెట్లగును? కలగాదు, నిక్కువమే, యెన్నడుక్రేగంటనైన ప్రేమతో బిలచిఅన్నమువడ్డించని నూపిన తల్లి నేడబ్బాయీ అన్నమునకు రమ్మనుట నా పూర్వజన్మసుకృతమా? లేక ఆమెహృదయపరివర్తనమా? యిందేదియుగాదు; నన్నే దియో మాయాజాలమున త్రోయుటకై పన్నినమహేంద్రజాలము కాకున్న యెన్నడైన అబ్బాయియనుమాట ఈమెనోటివెంట వెలువడినదా? ఇది యేమైయుండును? (ఆలోచించి) అవునవును పూర్వమును ఇట్టి అపూర్వమాయాప్రేమ జాలమునముంచియే నాతండ్రిచే రెండెకరముల భూమివ్రాయించుకొన్నది. నేడునుఅట్టిదేదియో

పన్నుచున్నది. ఏదియైననగుగాక, ఇప్పుడే నాకీతహతహ లేల. ఈ మారుతల్లికపట్ట పేము పర్యవసానము శాంతముతో జూచుచుండిన ఈ రంగమునగాకున్న పైరంగముననైన తెలియకపోదు. శాంతముతో నుండక చేయునది మాత్రమేమి.

చ॥ ఎపుడు మదంజలోకమును ♦ పీడి వియచ్చర మార్గమే గెనో
యపుడె మదీయకష్టములు ♦ హాభువివంటెను దేవ దేవ నా
కెపుడుత్వదీయ భక్తిలభి ♦ యించెనొనాటనె గల్గెశాంతినే
నిపుడు విఘాత వాత్రిలకు ♦ నేమిఘటించెద మార్పునీశ్వరా!॥

గనుక యిప్పుడునేను విచారించినను లాభములేదు. నాపినతల్లి హృదయమార్గమును తెలుసుకొనుటకా నంతకంటె వీలులేదు. కారణమేమన,

గీ॥ తగవులాడగ నిడికన్న ♦ తల్లిగాదు
తవిలి బతిమాల మిగ్రుభూ ♦ తంబుగాని
కూరవర్తనియైనట్టి ♦ మారుదల్లి
యాజ్ఞదాటియు బ్రతుకునే ♦ యువనిలోకను.

---

## తృతీయరంగము.

---

### రాజవీధి.

(గురువు లక్ష్మమ్మలు మాట్లాడుచు ప్రవేశింతురు)

లక్ష్మమ్మ—నాన్నగారూ! యేమిటి మీరు చెప్పబోయి విరమించిరి.

గురువు—యేమియులేదు, ఈయుపదేశమొందునది నాగమణియొక్క తెయేనా, భర్తయునా అది

లక్ష్మ—ఆసంగతియే పూర్తిగా తెలలేదు. ఆమె మగడు ఆమె మాటకడుగుదాటడనియే నానమ్మకము. కాకున్నను నామెయైనను తప్పక శిష్యురాలగును.

గురు—లక్ష్మమ్మా. నీకు ప్రపంచానుభవము తక్కువ. ఇప్పుడు భర్త లేకుండా ఆమెకొక్కతె కుపదేశమిచ్చిన కొన్నిచిక్కులు గలుగవచ్చును.

లక్ష్మి—నాయన్నగారూ! మీరు చెప్పెడుమాట చాలవింతగా యున్నది. భర్త అనుకూలుడుగానప్పుడు స్త్రీకి యుపదేశమునొంది మోక్షమొందుటకు వీలులేదనియా? మీరిదివరలో స్త్రీధర్మములనుగురించి యేమని సెలవిచ్చితిరి?

సీ॥ బాల్యంబుననె సూర్య ♦ భగవానుగూడిన
కుంతికిభువికీర్తి ♦ కొరతవడెనె
పలువురతోగూడి ♦ పాండవేయులగన్న
కుంతిమాద్రులకీర్తి ♦ కొరతవడెనె
కర్ణుతోగలియగా ♦ కౌతూహలముజూప
వరద్రోవదికికీర్తి ♦ కొరతవడెనె
దాశరాజతనూజ ♦ తపసినిమిన్ననుగూడి
గుణమునవక్కింతె ♦ కొరతవడెనె
గీ॥ గానవీరలకెవ్వరి ♦ యూనగలరు
భర్తయనుమతిలేకనే ♦ భయముపీడి
రనుచువార్త్రుచ్చినేడిట్లు ♦ లనుటదగునె
దేవనిభజ్ఞానదాతయో ♦ దేశికేంద్ర॥

గురువు—సరిసరి యిదియా నీవర్థము జేసుకొనినది. నేను మాట్లాడినపదంములకుగాదు.

సీ॥— భార్యభర్తలుగూడి ♦ భక్తితోగురువుల
యుపదేశముల బొంద ♦ నున్నగాని
తనకులోబడినట్టి ♦ ధవుడుగల్గినచాన
గురుపాదములపూజ ♦ గోరియున్న
పురుషులేభక్తితో ♦ పూజ్యమౌతారక
మువదేశమును బొంద ♦ నున్నగాని

వారిగేహములందె ♦ వైభవంబులతోడ
నుపదేశమిచ్చిన ♦ నొప్పునంచు
గీ॥ కాంతునిష్టము లేనిదే ♦ గలికిగోరి
గురుదరిం జేరివరమార్గ ♦ మెరుగనున్న
వారిగృహమందుదెల్పుట ♦ భావ్యమంచు
నాదుగురునాజ్ఞయిదిలల ♦ నాలలామ॥

లక్ష్మి— (తనలో) భర్తయిష్టము లేని స్త్రీలకు వారిండ్ల వద్ద నుపదేశమిచ్చిన మగవారిచే మర్యాద దక్కదని గాబోలు జడియుచున్నాడు. (ప్రకాశముగా) మీరీ నాగమణి విషయములో అట్టి యాటంక ముంచుకొనరాదు. నాగమణియు భర్తను వశీకరము జేసికొనినదియే, అచ్చట అట్టి యాటంక మేయున్న మనయింటియొద్దనే యేర్పాటు జేయించియుందును. భర్తృభీతిగల స్త్రీలు గనుకనే మొన్న వారిని మనయింటియొద్దకే బిలిపించి యుపదేశమిప్పించినది. అచ్చటట్టి యాటంక మేమియు జరుగదు.

గురువు— అమ్మాయీ! ఇంకొక మాట. ఇప్పటి దేశికులు ధనాపేక్షకులు. నిజమైనగురువులు శిష్యులను ధనమడుగ రాదని చెప్పుచు నేను దేశాటన చేయుచుంటినిగదా, ఇట్టి స్థితిలో నేను శిష్యుల నింతిమ్మనియడుగుట భావ్యముగాదు. నీవంటి ప్రియశిష్యురాండ్రే తదు శ్రద్ధదీసుకొని ఆయుపదేశము దీసుకొనువారలతో చెప్పి యెక్కువగా నిప్పించుచుండవలయును. అట్లు చేసినగాని ఈ దినములలో మావంటి గురువులకు, ఈయన నోటివెంట నొక్కపైస నైనను నడుగడని పేరుండును.

లక్ష్మి—ఈ విషయములో మీరుయింతగా జెప్పవలయునా! నాకు దెలియదు? ఈగ్రామములో ఇప్పటి కిరువదిమంది శిష్యురాండ్ర సమకూర్చితిని గదా మీరడిగి తీరా వారి నింతకట్నమిమ్మని నేనే చెప్పి రెండువందల రూకలను గల్లున పళ్లెములో పోయించ లేదా; ఎంత యిప్పించినను ఇతర గ్రామములలో మీశిష్యులగు రంగారావు రాజమ్మలవలె, నేభాగ మడిగితినా? మీకిప్పించు కట్న

ములలో నేనొక్క పైసాయైనను కోరను. నేనడుగునది ఆపరిపూర్ణమే?

గురు — అమ్మాయీ నీకు పరిపూర్ణమిచ్చుటకు నాయభ్యంతర మేమియు లేదు. వచ్చు మాఘశుద్ధ పౌర్ణమినాడు నీయిచ్ఛ దీర్చెదను. ఇప్పుడీ నాగమణి గురుకట్నమే మాత్ర మిచ్చునట్లేర్పాటు జేసితివి

లక్ష్మి — ఈ నాగమణియే మీశిష్యురాలయిన కట్నమొక్కటియేనా? మగనితో సహావచ్చి మీయింటి వద్ద నెలల పర్యంతము చాకిరి చేయుమన్నను చేయగలదు.

గురు — అమ్మాయీ. గురువులయిండ్ల యొద్ద సేవజేసి పొందు పుణ్య మందరకు లభ్యమగునా? నిజము నాభార్య గర్భవతిగా నుండ యెందరో శిష్యురాండ్రు తమస్వంత ఖర్చులతో వచ్చి సేవజేసి తరించిరి. అట్టిఫలిత మందరకును దొరుకదు.

లక్ష్మి — నాన్నగారూ; అదుగో గురుబిడ్డలతోగూడి రంగారావుగారు వచ్చుచున్నారు. మనమునుపోదముగాండు.

(రెండడుగులు వేయగా తెర లేచును. చౌదరియిల్లుకనుపించును. నాగమణి యెదురుగావచ్చి నమస్కరించి తోడ్కొనిపోయి యుచితాసనములపై గూర్చుండజేయును. చౌదరి వేంకటరావులు నమస్కరించి కూర్చుందురు. మరల రంగారావు మరికొందరు ప్రవేశింతురు. నాగమణి లక్ష్మమ్మప్రక్కగూర్చుండును నాగమణిచెవులో రహస్యముగా) నీభర్త యుపదేశమునొందుట కంగీకరించెనా?

నాగ — అక్కా, అంతచేతగానిదానిగా గ్రహించితివా నన్ను?

లక్ష్మి — సరియే, (గురువుతో) నాన్నగారూ మన నాగమణివిషయము మీకిదివరకు బాగుగాదెలియునో లేదో ఈమెచాలా యుత్తమురాలు.

సీ॥ వయసున చిన్నదై ♦ వరలిననేర్పునన్
సంసారచక్రంబు ♦ జరుపు తెరగు
పతియాజ్ఞలను మది ♦ బరమేశునాజ్ఞగా
దలంచాల్చి నెరవేర్ప ♦ గలుగు దెరగు

సవతిబిడ్డలన్నన • సాకుచున్నదయమున
కన్నబిడ్డలవలె • గాచు తెరగు
పరదేశవాసుల • పాంధుల గురువుల
నెమ్మినైన గొల్చెడి • నేర్పు తెరగు

గీ॥ బాల్యమాదిగ నేర్పిన • భాగ్యశాలి
ఈపె కనుగుణ్యుడగువాడె • యితడుగూడ
యిట్టివారల కుపదేశ • మిచ్చినేడు
ముక్తినీయగ వేడెద • మూలపురుష.

గురువు—బిడ్డా! నిజముగానిట్టి సుగుణమణులుండుట చేతనే ప్రపంచ ధర్మములును గృహస్థధర్మములును సక్రమముగా సాగుచున్నవి. దంపతులు చెరియొక దారినడచు కాపురములు వల్లకాడులని యార్యులు సెలవిచ్చిరి.

చౌదరి—(తనలో) గురువు, ఈముండమాటలువిని,నాభార్య సుగుణవతియని అనుకొనుచున్నాడు. పాపము, కలియుగరాక్షసియని దెలియదు.

లక్ష్మమ్మ—నాన్నా, మాబావగారి కుటుంబముమాత్రము అట్టిది గాదు. యేపనియైనను భార్యా భర్తలిరువురనుమతితోనే చేయుచుందురు. ఇప్పుడును ఇరువురు కలసియే కారణము దీసుకొనెదరు.

గురు—(తనలో) ఈముండ యుక్తులలో నన్నుగూడ మించినది. (ప్రకాశముగ) నిజముగా భార్యాభర్తలుపదేశము నొందుటలోనే యెక్కువనుభవమున్నది. నాశిష్యులందరు దంపతులే. కొందరు గురువులు ధనమునకాశించి యెట్టివారికైన యుపదేశమిచ్చెదరు. నిజమైన గురువులు శిష్యులగుణముల బరిశీలించి సత్పాత్రులని యెరిగినగాని కారణమివ్వరు.

వేంకటరావు—(తనలో) నాసవతితల్లి సుగుణములెట్లుగమనించి యిప్పుడు వీరు యుపదేశమిచ్చుటకువచ్చిరో.

చౌద—అయ్యా! మీరు సచ్చిదానందస్వాముల నెరుగుదురా?

రంగా—(తనలో)ఇప్పుడే నేనందుకొదగినసమయము. (ప్రకాశముగా)
సోదర సోదరీమణులారా నేను కూనూరులో వీరిని దర్శించి మన
స్సందేహము నివారించుకొనక పూర్వము సద్గురువులకొరకై నెల
లపర్యంతము లోకమెల్ల గాలించితిని. కాని మన నాన్నగారి వం
టివారుమాత్రము నాకు నెచ్చటను గాన్పించలేదు. వీరు పైకగు
పడరుగాని యుపన్యాసముగాని బోధగాని చెప్పుటకుపక్రమించిన
వీరి వాక్యధోరణి నిరర్గళ గంగాప్రవాహమే. అట్టిసమయమున
నెవరెట్టి ప్రశ్న వేసినను తత్క్షణమే వారిసందేహ నివారణజేయగల
సమర్థులు. మొన్న పామర్రులో మహాస్వాములందరు సమావేశ
మైన సనాతనసభలో వీరొక్క ప్రశ్నవైచి జబాబుకోరగా వారు
సమాధానమీయలేక సమయముగాదని తప్పుకొనిరి.

వేంకట—(తనలో) యేమి యసత్యప్రలాపములు! గురూపదేశములన
సత్యములాడుటేనని యర్థముకాదుగదా! (ప్రకాశ) రంగారావు
గారూ! పామర్రుసభకు నేనును వచ్చితిని. మీరాసభలో నెన్ని
గంటలవేళ మాట్లాడుటకు అవకాశమిచ్చిరో అవకాశమిచ్చినవా
రు సమాధానమేలనీయలేదో దయచేసి సెలవిచ్చెదరా?

రంగా—(తనలో) యెరిగినవారెవ్వరు లేరుగదా యని నోరుజారితి
ని, ప్రమాదము వచ్చినదే! [ప్ర॥ కా॥] మీరు మాకా సంభావన
సభలో జరిగినట్లపోహపడినట్లున్నది. కాదు వారిబసలవద్ద జరిగి
నది.

గురు—తన్నుతా పొగడుకొనరాదుకాని మాటవచ్చినదిగనుక చె
ప్పవలసివచ్చినది. కూనూరులో నాతో తర్కించుటకైవచ్చినప్రతి
కక్షులుగల పదివేలజనసభలో అష్టదళముల గూర్చియుపన్యసించ
గా వారొక్క ప్రశ్నయైనను వేయలేకపోయిరి. ఇట్టివి చెప్పవలెనన్న
వేనవేలుగలవు, అవన్నియు ఇప్పుడు చెప్పుట నవసరము. చెప్పను
రచితిని ఆ కూనూరులో నాయుపన్యాసమువినియే ఈ రంగారావు
మనస్సందేహముల విసర్జించి నాశిష్యుడయ్యెను. మరియు ననేకులు

—కారణమడిగింపగా మేము మీసత్ప్రవర్తన లెరుగువరకు నుపదేశమివ్వ మని నిరాకరించితిని, మీసత్ప్రవర్తన లీలక్ష్మమ్మవల్ల తెలుసుకొని యే మీకుపదేశ మీయ నిశ్చయించితిని. యింక నాలస్యమేల త్వరగా స్నానమాచరించి పూజాద్రవ్యములు సిద్ధపరచుడు. నేను కాలువ కేగి స్నానముజేసి వచ్చెదను. (అని గురువు, వెంట రంగారావు నిష్క్రమింతురు.)

లక్ష్మి—వీరుచాలాయుత్తములును, పూర్ణముగ దెలిసినట్టివారునుసుమీ అందుచేత నేపూర్వము నేకారణమందినగురువుల నిరాకరించి వీరినాశ్ర యించితిని. వీరికంటె వీరిభార్య చాలసుగుణమణి, వయసుమీరిన వారిని పెండ్లియాడినను, వీ రెప్పుడు దేశాటనము జేయుచుండినను యింటికి వచ్చిన అతిథిని సత్కరించుటలో చాలానేర్పుగలది, అట్టి ఇల్లాలును మీ రెప్పుడు చూచియుండరు. నే ననిన నామె కెంతో ప్రీతి. మొన్న మాయింటియొద్ద నే పదినాళ్ళున్నది. మీరుచూచియే యుండవచ్చును, ఆమె కిప్పుడు ప్రసవించు నెలలు. నీళ్ళు వడిన వెనుక మాసముల నొకసారి వత్తురు. అప్పుడామెను దర్శించి అందర ము ఆనందింతము. ఇంక గురువులు వచ్చువేళయైనది. పూజా గదికి బోదము పదుడు. (వేంకటరావు దప్ప నందరుబోవుదురు.)

కట—ఈలక్ష్మమ్మ యిచ్చకములను ఈ రంగారావునసత్యము లనుజూడ వీరీ గురువున కాంతరంగిక శిష్యులుగానుండి ఇట్టి యసత్యప్రకటనలచే అమాయిక స్త్రీలకును చాదస్తులుగానున్న పురుషులకునుఆసక్తిబుట్టించినిట్టియుపదేశము లిప్పించుటయేవీరికి ఆనంద మును, జీవనముగను తేలుచున్నది. ఇట్టి శిష్యులను గ్రామమున కొక్కొక్కనిపైకమిచ్చెదననియో, పరిపూర్ణ మిచ్చెదమనియో నియమించి గురువులు ఈతాంత్రిక నాటక మాడెదరనుకొనెదను. కాలున కిరువురశిష్యులన్ గనుచున్న ఈగురువులును, దినమున కొక కయ్యము లేకున్న నిద్రింపని ఈశిష్యురాండ్రునా? కామక్రోధముల గోసివేయునది. ఈ గురుతాంత్రిక నాటకము నేడు గాకున్న కొలది దినములకైన బయటబడకపోదు. మెల్లగానేనును ఈ

యుపదేశపు గదిలోనికిఁబోయి వీరియుపదేశములమర్మము గమనించెదగాక!

ఉ॥ అచ్చపుసత్యబోధకుఁ డ • హస్యము లేదని పెద్దలెల్లవా
క్రుచ్చుచునుండ నేఁడిచటఁ • గూడియు మోక్షమునందుమార్గముల్
జెచ్చెర బోధఁజేయుదుము • జేరుఁడు నీగదిలోని కంచు నీ
మ్రుచ్చులు వాగుచుండుటయొ • మోసమదెల్లనదెల్లమయ్యెడిన్

[ లోనికేగును, అవనిక జారును. ]



# కలికాల వేదాంతము.

## ద్వితీయాంకము.

### ప్రథమ రంగము.

—: ఉపదేశపుగది :—

(కుర్చీలో గురువు, ప్రక్కన నిలువబడి రంగారావు, పాదములవద్ద చౌదరీ నాగమణులు, లేదితర శిష్యులు చాపలపైనుందురు. నాగమణి పూజాదికృత్యములు సవరించుచుండును)

లక్ష్మమ్మ—ఇక నిశ్శబ్దముగా నుండుడు, పూజ ప్రారంభించ బోవుచున్నారు.

గురువు— (మానస పూజచేసి) బిడ్డలారా! చదువునకు ఓనమాలు దిద్దుట, గుణింతము నేర్చుకొనుట, పుస్తకము చదువుట, అర్థమెరుగుట యెట్లో, అట్లే విజ్ఞానమునకును మొదట తారకము; తదనంతరము సాంఖ్యము. అటుమీద అమనస్కము. ఆపైన పరిపూర్ణమును తెలుసుకొని, విముక్తులగుటయే సాధకులకృత్యము, గాన మీ యజ్ఞానమును నశింపజేయ మొదట తారకము నుపదేశించెదను. (చౌదరీ నాగమణులు గురువుపై క్రొత్తవస్త్రముంచుదురు గురువు వీరి శిరములపై చేయినుంచి) ఆత్మబిడ్డలారా! దీనికే హస్తమస్తక సంయోగమందురు. ఎందులకీ దృష్టాంతరమనగా, పక్షి తన రెక్కలసందున అజ్ఞానయుతమైన గుడ్లనునిచి యెట్లు జీవశక్తినిచ్చి వృద్ధినొందించుచున్నదో, యట్లే మీకును జ్ఞానమును గలుగజేసెదనను గుర్తు. ఇంతటనుండి మీరు నాయాత్మబిడ్డలు. గాన మీకు

కష్టసుఖముల ననుభవింపవలయునని బ్రహ్మ వ్రాసిన నుదుటి వ్రాతలును నా హస్తముతో తుడిచివైచెదను. (విభూతి నొసటిపై వ్రాయును.) ఇంతటినుండి మీకు బ్రహ్మ వ్రాసిన వ్రాలు నశించినది. మీ భారమంతేయు నాపైబడినది. గాన మీకు జ్ఞానము గలిగింపజేయుటకై మీనాలుకపై బీజాక్షరములను వ్రాసెదను. (నాలుకపై ఓం, హ్రీం, శ్రీం అని వ్రాయును.) ఇప్పుడు మీలో జ్ఞానవృక్షము మొలకమెత్తినది. ఇక ఈ జ్ఞానవృక్షమును వృద్ధి నొందించుటకై మీగురు పాదతీర్థమును అప్పుడప్పుడు పోయుచుండవలయును [చౌదరి నాగమణులు గురుపాదములు గడిగి ఆతీర్థము లోనికిపుచ్చుకొనియు శిరములజల్లుకొనియు అందరకు పంచియిత్తురు] బిడ్డలారా మీరిదివరకు అజ్ఞానమున నుంటిరిగాన శూద్రులు. నేడు గురూపదేశ ప్రభావముచే మీశూద్రత్వము నశించి బ్రహ్మత్వముగలిగినది. ఇక గురుపూజ జేసుకొనుడు. తదనంతరము తారకముపదేశించెదను.

లక్ష్మ—(ప్రక్కకుజూచి యులికిపడి గురువుతో) నాన్నగారూ ఇంతవరకును మనము గమనించనేలేదు. అదుగో ఆప్రక్క వెంకటరావు కూర్చొనియున్నాడు.

గురువు—[కొంచెము భయముచే] అయ్యో యెంత ప్రమాదము వాటిల్లినది యిక్కడున్నాడు వెంకటరావు. [చూచి] అబ్బాయీ యిటురమ్ము [ప్రక్కనున్న వేంకటరావు లేచివచ్చును.]

వెం—ఎందులకండీ

గురు—అబ్బాయీ నీవిక్కడనుండ వీలుపడదు.

వెం—ఎందుచేత స్వామి

గురు—గురుబిడ్డలుదప్ప యితరులుండరాదు.

వేం—భగవత్సంబంధమైన వాక్యములు కొందరువినుటయు, కొందరు వినకుండుటయునా స్వామీ,

గురు—బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః, అను ప్రమాణానుసారముగా గురుబిడ్డలనగా అజ్ఞానాంధకారమును బాసిన జ్ఞానమార్గానుచరులు.

—ఉపదేశవేళలందు అట్టిగురుబిడ్డలతో గురూపదేశముపొందని అజ్ఞానులు కలసియుండరాదు.

వేంక—అయ్యా! ఈగురుబిడ్డలును ఉపదేశమునొందకపూర్వమునావంటి యజ్ఞానులేకదా ఇప్పటి నావలెనే వీరలుగూడ ఇట్టిజ్ఞానబోధనలు చూచియు, వినియేగదా ఇట్టిజ్ఞానముపొంది ఇచ్ఛగలిగినదియు పొందినదియును. అట్లే నేనును ఇట్టిసదుపదేశములగాంచి యేలజ్ఞానమును పొందరాదు.

నాగమణి—(విసుగుదలతో) ఎందుకునీకీ ప్రశ్నలు. వారుండరా దను చుండ వెళ్ళరాదు.

గురు—అబ్బాయీ. నీవడిగినది మంచి ప్రశ్నయేగాని, పూర్ణముగా తెలిసియు తెలియకయు మాట్లాడుచుంటివి. ఒక కుఱ్ఱవాడు బ్రాహ్మణయింట జన్మించినను వడుగు జేయువరకు వానికి వేదప్రవేశము గలుగక నీచుక శూద్రుని వలెనే గాంచుచు వడుగు అయిన అనంతరము ఎట్లు సమానమైన హక్కు నిచ్చెదరో అట్లే అందరును సమానమైన మనుష్యులైనప్పటికిని గురువు ఎంతవరకు బ్రహ్మ్రాలు తుడిచివైచి నుదుట విభూతినుంచడో అంతవరకు అజ్ఞానులే. ఆయజ్ఞానులీజ్ఞానులతో గలసి శిష్యోపదేశ వేళలందు చూచుటకుగాని వినుటకు గాని హక్కు లేదు. మేము వేరుగా బోధజేయునప్పుడు మాత్రమువారు వినవచ్చును.

రంగరావు—నాన్నగారు చెప్పుమాటలు అర్థమగు చున్నవా?

వేంకట—అర్థమగుచునే యున్నవి. మీతో మాట్లాడుటకు తగిన శక్తి నాకు వేదాంతమున చాలదు కాని ఒక చిన్న సందేహము. మీవలె రామదీక్షిత సాంప్రదాయులును, అచల పరిపూర్ణులును అగు, భాగవతుల కృష్ణదాసుగారు వారి కందార్థములలో

కం॥ ఎవరున్న యేమి భయమని
సవరింతురు తప్పులున్న సాధులు వినినన్
సవరింతుము సుమ్మి దివిని
నవనీతులు చెందనేలా నయ్యే దేమోయీ

అందులో తునదీ పొయ్యోదె మోయీ
భవనాశస్థితి లేని పద్ధాతి ఈగోధా
నవురుగావించు చాటులం మాటలా! అయ్యోదేమోయీ!

దీనికేమి సెలవిచ్చెదరు. శనువీపొంపద్రాయము గాదా యేమి!

గురువు—ఉండుము వచ్చెదను. (చుట్టుగాల్చు నెపముపై గురువును వారి ననుసరించి రంగారావును బయటికివచ్చి) ఏమిటోయి రంగారావు. ప్రాణముమీదికివచ్చినది. ఈ వెధవను విడిపించుకొనుటెట్లు?

రంగా—(ఆలోచనతో తలపంకించుచు) ఇంక జేయున దేమున్నది. ఉండనీయుడు ఇప్పటికాలమునకు బహిరంగోపదేశముల పద్ధతియే మంచిదిగా గనుపించుచున్నది. లేకున్న ఈ యింగ్లీషు చదివిన వెధవలంతాగూడి మంచివిషయము మొదలెందులకని గేలుసేయునా గిరి. గనుకనే కొందరు గురువులు బహిరంగోపదేశములు జేయ మొదలిడిరి. మనము నీదేదారి త్రొక్కిన గాని విలువయుండదు. లేకున్న ఇప్పుడే గురుత్వమునకు స్వస్తిచెప్పవలసి వచ్చును.

గురు—నీవు జెప్పునది మంచిదియేగాని ఒక చిక్కువచ్చు నట్లున్నది. గురుపూజాకాలమున శిష్యులందరు నూటఒక్క ప్రదక్షిణము జేయునప్పుడు నేను సమాధిలోనుండి శ్వాసబంధించినట్లు నటన జేయవలయును గదా. ఇట్టివెధవల నుండనిచ్చిన అదేసమయమున శ్వాసపరీక్ష జేసెదమనిన గొప్ప ప్రమాదమువచ్చి మనగుట్టు బయల్పడదు గదా.

రంగా—నాన్నగారూ! ఆరితేరిన మీశిష్యుల ప్రక్కనుండియు అట్టి ప్రమాదము రానిచ్చునా. శ్వాసను నేనే పరీక్ష జేయుదు శ్వాసబంధింపబడినట్లు వెల్లడించుచుందును. పట్టుదలకెవరైన శ్వాసపరీక్షించెదమనిన ఆసమయమునకు దగ్గియో చిటుకవేసియో సంజ్ఞజేసెదను అది మీరు కనిపెట్టి శ్వాసబంధింపుడు మరియు పూజానంతరముగూడ సహస్రారమునుండి జీవుడు యథాస్థానము నకు రాలేదని నేను కంఠస్థానమును సవరింతును. అప్పుడుమీరు మెల్లగా

- జ్ఞప్తికివచ్చినట్లు నటింపుదు ఇదిగాంచినవారందరు అబ్బురపడి భక్తిపరవశులగుదురు.

గురు—సరే కానిమ్ము. నీవుసూత్రము జాగ్రత్తగా జూచుచుండుము. (యథాస్థానమునకువచ్చి కూర్చుందురు) ఏమమ్మాయీ అట్లే నిలబడితివి.

వేంకటరావు— తమసెలవుకొరకే యెదురుజూచుచుంటిని.

గురు— ఇదివర కితరుల కానిచ్చుటలేదు. ప్రమాదమనిగాదు. ఇట్టి అమూల్యవిషయములు పామరుల చెవిబడిన వారలావిలువను దెలిసికొనక హేళనగా ప్రజలకు తెలియపర్చి దాని విలువను నశింపజేయుదురు. అందుచేతనే అనాదినుండియు ఈ మంత్రములు నింతరహస్యముగా నుంచబడినవి. అయినను నీవు బుద్ధిమంతుడవని దెలుసుకొంటిని. శ్రద్ధతో వినదలచిన యటుకూర్చుని వినుచుండుము.

వేంక— అయ్యా! మాణిక్యము మసిపాతఁగట్టినను దానివన్నె తరుగనట్లు తారకమంత్రము పామరుల నోటబడినను దానిమహిమ తరుగుననుట హాస్యాస్పదము. (కూర్చుండును.)

గురు— అమ్మాయీ! పూజ కింకెందుల కాలస్యము? (అందరులేచి విభూతినిబెట్టించుకొందురు, గురువు సమాధిలోనుండును. శిష్యులు ప్రదక్షిణము జేయుచు కీర్తన. 1వ అనుబంధము పాడుచునుండ అవనిక జారును.)

——:o:——

## ద్వితీయరంగము.

——:o:——

### అదే యుపదేశపుగది

### కీర్తన 1 అనుబంధమే.

రంగా— అమ్మలారా మనము నూటఒక్క ప్రదక్షిణ జేయువరకు సమాధిస్థితిలోనున్న నాన్నగారి నొక్కసారి అందరు దర్శించి పావనులుగండు. ఇప్పుడు జీవాత్మ పరమాత్మలో ఐక్యసంధానమైన

అమూల్యసమయము. ఇట్టి అవకాశము మరల దొరకుట దుర్లభము.

వేంక— (తనలో) యేమి ఈ రంగారావు లక్ష్మమ్మల మోసకృత్యము. శ్వాస నడచుచున్నట్లు బట్ట తొలగినపుడు స్పష్టముగ గనపించుచుండ అట్టి మోసము బయల్పడకుండుటకై వస్త్రమునొకటి వంటినిండ గప్పుటయు ఈ లక్ష్మమ్మ శ్వాసపరీక్షించి బంధించబడినట్లు వెల్లడించుటయు వీరిమోసము తెల్లముగ చునేయున్నది. అయినను నేను ఈమోసముల గమనించి యూరకుండుటదక్క జేయునదేమియు లేదు.

లక్ష్మ— రంగారావుగారూ! గురువుగారు సమాధి నుండి స్మృతికి వచ్చునట్లు ప్రతిక్రియ జేయవలెను.

రంగా— (కంఠస్థానము సవరించును గురువులు మెల్లగా స్మృతికి వత్తురు. టెంకాయ బగులగొట్టి మంగళహారతిత్తురు.) కీర్తన 2 అనుబంధము.

గురువు— (చౌదరి,నాగమణులపై జేయివైచి)

శ్లో॥ గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః॥

అనగా సకలజ్ఞాన సంపత్కారమైనటువంటి అచలబోధను మీకు బోధించి జ్ఞానమునుకలుగ జేయుచున్నాను గనుక, నేనేబ్రహ్మను. యేలనన బ్రహ్మ జీవుల కలుగజేయునట్లే మీకును జ్ఞానమును కలుగజేసితినిగనుక, ఇక విష్ణువునూనేనె, కారణమేమన విష్ణువు జీవులపోషించునటులే మీ జ్ఞానమును బోధఅను నీరుబోసి పెంచుచున్నాను గనుక, ఈశ్వరుడు జీవుల నశింపజేయునట్లు మీ యజ్ఞానమును నశింపజేయు చున్నాను గనుక నేనే ఈశ్వరుడను. (కన్నుల మూయించి కొలకుల నొత్తి) గాంచిరా. పరబ్రహ్మ స్వరూపమును. పరమాత్మను మీకు జూపి, పరిపూర్ణులజేయుదును గనుక నేనే పరమాత్మ స్వరూపుడను. ఇకనో ఆత్మబిడ్డలారా! మీకు సమస్తకోరికలు తీర్చు భగవంతుని జూపిం

-చిన గురుడనగు నన్నే రక్షకుడుగా భావింపవలయును. ఈగురు ఋణ విముక్తికై తను మనధనములను గురువునకు ధారవ్రాసినను ఋణవిముక్తి కానేరదు గాన త్వరలో గురుదయ సంపాదించుకొని పరిపూర్ణ మొందెదరుగాక, ఇంకదగ్గరకు రండు మంత్రముపదేశించెదను. (చౌదరి నాగమణులపై శాలువ ముసుగువైచును.)

వేంక—(కండ్లు మూసుకొని కొలకులు వత్తుకొని తనలో) యేమి. ఈ వెలుగు నేనా భగవంతుడనునది. కాదు కాదు ఈవెలుగు జూపు యొక్క నైజగుణముదప్ప పరమాత్మ స్వరూప మెన్నడు గాజాలదు. ఈవెలుగే భగవంతుడైన యిక ఈ గురువులేల? ఉపదేశములేల. యెల్లరు ఇప్పుడే కన్నులు గట్టిగా మూసుకొని కొలకులను నల్పుకొనుడు మీరందరు భగవంతుని జూడగలరు (చిరునవ్వుతో) అయినను ఇదివరనుండి దెల్పుబోధకంటె ఈ వెలుగే దేవుడనిన విచిత్రమేమియు లేదు.

గురు—(ముసుగు దొలగించి) బిడ్డలారా ఈ మంత్రరాజమును మీరు సాధ్యమైనంతవరకు ప్రతిదినము జపించుచుండవలయును. నేను త్వరగా వెళ్లవలసిన పనియున్నది. మరల కొద్దిదినములలో వచ్చి మీకు జ్ఞానాభివృద్ధియగు సద్బోధ జేసెదను.

రంగా—నాన్నగారూ మీపరిపూర్ణ బోధవినుటకై శిష్యులుచాల ఆతురత బడుచున్నారు గాన రేపుండి బోధల వినిపించ గలందులకై ప్రార్థించుచున్నాను.

గురువు—నేనుతప్పక తెల్లవారజామున వెళ్ళితీరవలయును. మరలనొకసారివచ్చి విశేష యుపమానయుపమేయదృష్టాంత దార్ష్టాంతరములతో విపులముగా తెలియజేసెదను. ప్రస్తుతము మీరు బోధవినుటకై యెక్కువ తాపత్రయమునబడ నవసరములేదు. ఎందుచేతననగా మీరు యేనాడునాబిడ్డలయితిరో నేను యేనాడు మీశిరములపైహస్తముంచి నుదుట విభూతినుంచితినో ఆనాడే మీపాపపుణ్యములన్నియు నాపైబడినవి. నేనుదూరదేశమందున్నను తాబేలు మెచ్చుటనో గ్రుడ్లుబెట్టినప్పటికి తనమనసులో పిల్లలగునట్లు తలచినంతమాత్రముచే యెట్లుపిల్లలగుచున్నవో, యట్లేమీకును జ్ఞాన

మును కలుగ జేయగలుగుదురు. ఇప్పటి వేదాంతము దృష్టాంతర-ములపైననే యాధారపడియున్నది. కాబట్టి ప్రతివిషయమునకు సరియైన దృష్టాంతరముచూపినంతనే యొప్పుకొనవలసినదే. ఓఆత్మబిడ్డలారా, తాబేలు తనగుడ్లను ఆసక్తిచే వీక్షించినంతమాత్రమున యెట్లు పిల్లలగుచున్నవో, అట్లే గురువు శిష్యులను ప్రేమతో వీక్షించినంతమాత్రమున వారలకు దివ్యశరీరముకలుగును. గాన గురువే దైవముగాపూజింపుచు గురువుచే ఉపదేశింపబడిన మంత్రమును నియమముతో జపించుచు గురునింద జేయక, గురుబిడ్డల ననూయతో జూడక, యెట్టికష్టసమయమునందైనను సత్యమునే వచింపుచు, లోకములోనుండినప్పటికి ప్రకృతినంటక సంచరింపుచు, కామమును నశింప జేసి, క్రోధమును జంపి, ధనాశాపిశాచమును పారద్రోలి భార్యబిడ్డలపై మమత జెందక గురువుపై పూర్ణలక్ష్యముంచి విశ్రాంతివేళలందు గురుసేవ చేసికొనుచు మెలగుచుండవలయును. అట్లుగాక యెవడు గురునిందజేసి గురుమంత్రము వెలిబుచ్చునో యట్టివాడు నరకమున యాతనాశరీరముతో వేయిసర్పములచే కరిపింపబడుచు సహస్రవర్షముల కొకొక్క సర్పమును వదిలింపబడుదురని శాస్త్రప్రమాణము. గాన గురుభక్తిగలిగి గురుదయకు పాత్రులగుటకై ప్రయత్నింపుచుండుడు. (కీర్తన - మూడవ అనుబంధము.) ప్రస్తుతము యింతటితో విరమించుచున్నాను. ప్రయాణమునకు వేళయయినది. (ఓం, అని అందరిచేత ననిపించి శ్రీమద్రమారమణ గోవిందోహరి అందురు, గురువులేచి నడుచుచుండగా అందరు లేచి అనుసరింపుచు మహాత్మా అచలపరిపూర్ణ గురువరేణ్యులకు జై అనుకొనుచు లోనికి బోవుదురు.)

వేంకటరావు—కటకటా లోకమెంత కడగండ్లపాలైనది. మూర్తిత్రయమును తామేనని దుర్బోధలుజేయు, ననుభవములేని ఈకపట గురువుల మాయలంబడి వారాడుయిచ్చకములను మెచ్చుకొని ముందువెనుక లారయక పరమపదమిచ్చునని నమ్మి పాపభూయిష్టమైన వారిపాదములుగడిగిననీళ్ళు ఛీ,ఛీ, నోరాడకున్నది. కక్కు

వచ్చుచున్నది. తలవైబోసు కొనుటయును, తాగుటయునా? యెంత వెఱ్ఱి యెంతయసహ్యము ఓ దైవమా, నీవుగాకున్న ఈసంసారవృక్షసంకటులు, ఈబూటకనాటకులు, నీయధములు. నిర్మూలించి ప్రజల నుద్ధరించువారెవరు? ఓ దయామయా, మూఢలోకమునకు జ్ఞానము ప్రసారింపుము.

సీ॥ కంసాదిరాక్షస ఖలుల ♦ జంపగకృష్ణ
భగవానుడనుపేర ♦ బరగినావు
మనుజులధర్ములై ♦ మనువేళ వ్యాసుడన్
పేరధర్మమునిరూ ♦ పించినావు
లోకంబు జీవహిం ♦ సాకులంబగు వేళ
బుద్ధుడెజీవుల ♦ బ్రోచినావు
ధర్మంబుకూలి య ♦ ధర్మముద్భవమైన
వచ్చిబోయితని నొక్కి ♦ పలికినావు

గీ॥ సమయమే తెంచె శపథంబు ♦ జక్కబెట్ట
గానవేగమె యీ కలి ♦ కాల గురుల
మాయవేదాంత బోధలు ♦ మంటగలుప
గానగారాదె లో ♦ కంబు కమలనాభ.

(అంజలిబద్ధుడై ప్రార్థింపుచుండ అవనిక జారును.)






# తృతీయాంకము.

—:0:—

## ప్రథమరంగము.

—:0:—

### —§ గురువునిల్లు §—

( కనకమ్మ పుస్తకము జదువుచు ప్రవేశము )

కనకమ్మ — వరునిధైర్యసాహసముల పరీక్షించి ప్రేమించి వరించిన ఈ సీతా వివాహమే వివాహముకాని. బాలికల అనుమతిలేకయే, నింట గల యేముదుసలిపట్టుదలచేతనో బాలికలను మూడవపెండ్లిముదుసలికి కట్టబెట్టి వధువు భర్తపైకించిదసూయ జూపినంతనే పాతివ్రత్యధర్మమునకు భంగమువచ్చినదనియేడ్చు ఓకలికాలపిశాచములారా యేమి యన్యాయమిది? సీతాసావిత్రులకథల నుదాహరణలిచ్చి పాతివ్రత్యధర్మముల హిందూ స్త్రీలు అనుసరింపవలయుననుటయేగాని పూర్వమువలె తగిన భర్తలనెన్నుకొనమాత్రము హక్కివ్వరు. మనసా ప్రేమించని యేముసలిగొడ్డునో అంటగట్టి పాతివ్రత్యధర్మముల పాటించుటలేదని యేడ్చినలాభమేమి. పూర్వపతివ్రతలధర్మముల వినియేల వుబ్బెదరు?

సీ॥ కలగని ప్రేమించి ♦ కాంతుగా జేకొన్న
సావిత్రిపతిసేవ ♦ సలిపెనన్న
మత్స్యయంత్రముగొట్ట ♦ మగలగా జేకొన్న
ద్రౌపతి పతిసేవ ♦ దవిలెనన్న

శివుని విల్ విరిచిన ♦ శ్రీరాముపత్నియై
జనకజ పతిసేవ ♦ జరిపెనన్న
దివిజులదెగనాడి ధవుని ♦ గానలు నెంచి
దమయంతి పతిసేవ ♦ దప్పదన్న
గీ॥ అబ్బురంబేమియుండు మీ ♦ యుబ్బగాని
కోరికాంతునివరియించి ♦ కోమలాంగి
యెవతె ఈపాటిధర్మంబు ♦ దవులకుండు
కాటికగువానికిని నంట ♦ గట్టుకున్న.
ముసలిమగనికితోడు దేశ్రదిమ్మరులును, ధనాశాపిశాచరులునునగు నాభర్తవంటి భర్తలేగలిగిన యువతులగతి యింక జెప్పవలసిన దేమున్నది. ఓ భగవంతుడా నాభర్తవంటివానినిమాత్రము పగవారలకైన సమకూర్పకుండుదువుగాక.
సీ॥ మాయవేదాంతముల్ ♦ ల్మతిలేనివిధవల
క్షేపొద్దుదెల్పుట ♦ కేగుచుండు
శిష్యులైవచ్చెడి ♦ చేడెలముందర
నాన్నగారనుమని ♦ పన్నుజంపు
గురువుగ రసివచ్చు ♦ గుణహీనులకుదప్ప
బిల్లికిబిచ్చంబు ♦ బెట్టనీడు
చేర్చుక్కబెట్టిన ♦ చరచరలాడుచు
వీబూతిబూసెడి ♦ విధము దెల్పు
గీ॥ గ్రామజనులకు జగడముల్ ♦ గలుగజేసి
కోర్టులెక్కంగ నేరిపి ♦ కొనరికొనరి
మాడలార్జింప నెంచు నీ ♦ మాయగురుల
మగలగా నెంచేగారాదు ♦ మాటకైన॥
లోకులకు వేదాంతమార్జింపుడని దెల్పుచు తానుమాత్రము ధనమునార్జింపుచు ఈకపటగురునాటకములాడు పాపంబుజాలక గ్రామములకు ద్వేషములబుట్టించి వారిం గోర్టులపాలు జేయుటెందులకు? తానీ పీడ పిద్దమ్మయగు గంగమ్మ నాశ్రయించుటెందు

లకు? ఓ దైవమా ఈకలికాల పిశాచియగు కపటగురుత్వముల నశింపజేసి యింటిలో నొక్కనాడైన సంతోషమునుండరనియే ద్భుమాదుఃఖమును, వేదాంతులమని దేశద్రిమ్మరులై దిరుగుచు,మా పరువుల పటాపంచలుచేయుచున్నారని లోలోన దుఃఖించు నీకప టశిష్యుల సోదర మాతాపితరుల దుఃఖములను యేనాడు నశింప జేయుదువో గదా.

మోహనరావు—(సిగిరెట్ గాల్చుచు, విలాసముగాప్రవేశించి) ఏమ మ్మో కనకమ్మా నీదేవుడు దిగినాడు గ్రామములోనికి,

కనక—ఎప్పుడు దిగినాడు.

మోహన—ప్రొద్దుటనే గంగమ్మ యింటివద్దకు దిగినాడు. ఇంతలో పొలమునందు పనిజేసిన పనివాండ్రు కూలిడబ్బులకొరకై రాగా వారిని తిట్టి కొట్టుటకు తయారైనాడట. ఇంతలో పెద్దమను ష్యులు కొందరు వారిపై దిరుగబడ గంగమ్మగారి యింటిలో దూరినాడట. ఈవింత నూరందరు విచిత్రముగా జెప్పుకొనుచు న్నారు.

కన—అయ్యయ్యో యెందులకీ గౌరవ హీనకృత్యములు జేసి నలు వురినోట బడుట, కులవృత్తులవీడి గురువేషముల ధరించి, అమా యికులజేరదీసి, వారిమర్యాదల నశింపజేయుచు పూజలని, పున స్కారములని, వారల వచించి ధనము లాగుచు, అదియును జాల క, ఇట్లు పనివాండ్రడ నేడ్పించుచు గ్రామస్థులకు విరోధియై, మా నాభిమానములు వదలి నలువురేమనియెదరో యనుకించయైన లేక ఇట్లు వర్తించుటయా? అయినను వీరిననవలసిన పనియేమున్నది. కాముకుడని తేటతెల్లముచేయు రెండవ వివాహమును తిండిపోతని తెలియజేయ స్థూలకాయమును సోమరియని తెలుప సూర్యోదయ మెరుగని నిద్రయు వదరుబోతని తెలియ నడిరేయివరకు చెప్పువు క్కిటి పురాణములును జిహ్వాచాపల్యమును తెలియజేయ పిండి వంటలతో భోజనమును, అభిమానమును తెలుప పండిత శాలువ లును, దురలవాట్లను మానడని తెలియజేయ చుట్టపీకలును, వీరి

పరికిమాలిన తనమును స్పష్టముగా తెలియజేయుచుండ, వీరుమహానుభావులని చేరి యుపదేశములబొందు వెధవలననవలెను గాని వీరిననవలసిన పని లేదు.

మో— పాపము, ఈ దొంగగురువుల నడవడికలు తెలియక అమాయికులిట్లు చేరుచుండిరిదక్క. వీరి ప్రవర్తనలు యెరిగినచో నొక్కరైనను చేరరు.

కన— పొరపాటే. వీరి నడువడికలు తెలియక శిష్యులైన వారొక్కరు లేరు. అందరు పూర్ణముగా వీరి ప్రవర్తన తెలిసియే లోకము నకీర్తి వచ్చునని కొందరును, వారి దుష్ప్రవర్తనలు నిరాటంకముగా జరుగునని కొందరును వీరి నాశ్రయించిరి.

మో— వీరలు ఈ దొంగగురువుతో కలసి తిరుగుచుండిన ఇంటివద్ద పెద్దవారలచే మాటరాదా!



కన— పిచ్చివాడా? ఇచ్చట మనమిరువురము ఇష్టాగోష్ఠిగా నుండ మనకు యెంత మాటవచ్చుచున్నదో వారికిని నంతియే. గాక ఈ కాలమున గురూపదేశికులగునది పూర్ణస్వాతంత్ర్యముగల విధవ స్త్రీలును, భార్యమాట కడుగుదాటని పురుషసింహములే నూటికి తొంబదిమంది విషయము పూర్ణముగా తెలియక యుపదేశమొంది పిదప పశ్చాత్తాపులగువారు కడమ పదిమందియు, అది యటుండనిమ్ము. వీరిని గంగమ్మ యింటివద్దనే గాంచితివా?

మో— కనుపించెను. కాని తనకే మనయిరువురపై నదివరకే అనుమానముగా నున్నది. ఈ సంగతియు నావల్లనే తెలిసినట్లు అతనికి తెలిసిన మరింత వాపోవును. గాన నావలన తెలిసినట్లుమాత్రము అతనికి తెలియనీయకుము. వారు వచ్చెదరేమో నేనుపోయివచ్చెదను. (నిష్క్రమించును)

కనక— సరి యుండనిమ్ము. నాకేమియు భయమును చింతయును కూడ లేదు. గంగమ్మ సంబంధము వీరికున్నటు లిదివరకే జాచాయుగా తెలిసినది కానిమ్ము. వీరి వేదాంతబోధలును శిష్యులమని వ

చ్చు వారలకు జేయుంచుమర్యాదలును ఇక యెట్లుసాగునో కనుగొనెదను (పోష్టుబంట్రోతు ప్రవేశించి)

పోష్టు— గురువుగారికి కవరువచ్చినది. వారెచ్చటనుండిరి?

కన— నాచేతికిచ్చిపొండు. వారికిచ్చెదను. (కవరుయిచ్చి బంట్రోతు వెళ్ళును.)

కన— యిందేమిగలదో జూచెద (కవరుచించి చూచుచు చదువును) అచల పరిపూర్ణస్వరూపులును, అఖండ అద్వైతబోధనామృతులును, మానవాతీత భావార్థసులభ గ్రాహ్యులును, కామరాగాద్యనేకచిత్తవికారరహితులును, నిరంతర విరక్తుండును, యదృచ్ఛాలాభ సంతృప్తుండును, సత్యవ్రతుండును, పరస్త్రీ పరాఙ్ముఖుండును దేహేంద్రియాద్యుపేక్షాబుద్ధియుక్తుండును నగు సద్గురువరేణ్యుల పాదకమలములకు, ప్రకృతివిముక్తికాముండును, మీయనుగ్రహాధీనుండును నగు, నేను మస్తకమున హస్తములు సుకులించి చేయు విన్నపము రేపు తమదర్శనమునకు వచ్చుచున్నాను. మీరు నా వెంటవచ్చుటకు సిద్ధముగానుండ ప్రార్థన ఇట్లుభవదీయభృత్యుడు రంగారావు వ్రాలు (అసహ్యముతో) యేమి ఈకృత్రిమగురుశిష్య పరామర్శనలేఖలు ఇది యంతయు అచ్చుపుటాచార విధానము వెల్లడించుటయేనా లేక పైపైపూచిన మెరుగుబూతలా? ఈవిషభాండములు, ఈతేనె పూసిన కత్తులు విచ్చలవిడిగా లోకములో దిమ్మరిలినముప్పు తప్పనిమాట వాస్తవముకాన ఈనాభర్తకపటగురుత్వమును నశింపజేయుటకును ఈ దొంగశిష్యత్వముల నశించుటకును, ఉదాహరణగా ఈలేఖచించి పారవైచెదను

చం॥ గురువులమంచుకుచ్చితులు ♦ కూడగదీసియు నీచకార్యములో
యరమరలేకసల్పుమగ ♦ నాండను కష్టములందజేయుచున్
ఘరువు ప్రతిష్టలేక పర ♦ భామలకూడెడి దుష్టదేశికుల్
ధర నశియించిపోవుటకె ♦ తప్పదు సత్యము లేఖసాక్షిగన్

(అని లేఖచించుచు పారవైచుచుండ అవనికజారును)

## ద్వితీయ రంగము.

---

—§ లక్ష్మమ్మ యింటి వసారా. §—

(లక్ష్మమ్మ, రంగారావులు మాట్లాడుచు కూర్చుందురు)

లక్ష్మమ్మ—మీ గ్రామస్థులలోగల గురుబిడ్డల సందరను, వారమునకొక దినమైనను నొకచోట సమావేశపరచుచుంటివా. ఇంకనెవరైన యుపదేశముబొందనున్నారా?

రంగా—యేమిసమావేశము, యేమిలోకము. గ్రామస్థులుచందాలపై గట్టించుకొన్న ఆపూజామందిరము గురువుగారికి దానముగా నీయవలసినదనికోరగా అందుపై కొందరకు ఇష్టములేక సరిగా భజనకు రావడములేదు. ఇక క్రొత్తవారలసంగతి సరేసరి.

లక్ష్మ—రంగారావుగారు! తొందరపడి, యేపనియుజేయరాదు. ప్రతి శనివారము భజనలుజేయింపుచు గురువుల గొప్పతనమునుగురించియు, ఉపదేశములబొందిన కలుగు లాభమునుగురించియు, విపులముగాజెప్పుచుండ క్రమముగా వారలేవచ్చి యుపదేశములపొందగోరెదరు. మీకుఇంకను ఈశిష్యవశీకరణతంత్రము బాగుగా దెలియదు. శిష్యులజేర్పించుటకు బహుప్రజ్ఞలుగావలయును.

సీ॥ క్రొత్తవారికి మది ♦ కోరికజనియింప
ప్రేమతో భజనలు ♦ బెట్టవలయు
చూడవచ్చినయట్టి ♦ సుందరీమణులకు
భజనలం దాసక్తి ♦ బరుపవలయు
అటుకొంతకాలంబు ♦ నరిగిన మెల్లగా
నేస్తమై తత్వముల్ ♦ నేర్పవలయు
తత్వార్థములనెల్ల ♦ తవిలి చర్చింపుచు
నియమంబులలో వారి ♦ నిలుపవలయు

గీ॥ నిల్పి యాచార పూజల ♦ వెన్నియైన
గురువు లేనట్టిసాధన ♦ గూడదంచు

మదికి దట్టగఁజేసిన ♦ మంచితోఁడ
అప్పటికిగాని జేరరీ ♦ యూడవారు.

రంగా—నిజమే నాకును ఇట్టి శిష్యవశీకరణ తంత్రములు నాన్నగారు ఆదిలోనే దెల్పియున్నారు, గాని యెన్ని యుక్తులు బన్నుచున్నను పూర్వమునవలె నిప్పుడుపదేశములొందుటకు ప్రజలలో నెక్కువ వుత్సాహము లేదు. దానికి దగినట్లే కొందరు బయలుదేరి గురువులు వట్టిడాంబికవదరు పోతులనియు, వారిచేత ఉపచారములుజేసి ఉపదేశము లొందుట మహానీచమనియు విపులముగా జర్చించుచున్నారు. అందు చేబోత్రిగా పీగురువుల వైపుతిరిగిజూచువారే లేరు.

లక్ష్మి—ప్రచారముల మూలమున గురూపదేశమును పొందుట లేదనుట పొరపాటు, యేయుద్యమమైనను క్రొత్తవింత, పాతరోత, అను సామెతగా ఆదిలో యెక్కువగా చెలరేగి అనంతరము శాంతించుట పరిపాటి అంతియేగాని వారి ప్రచారముల మూలమున గురూపదేశముల తిరస్కరించుచుండినుట కేవలము భ్రమ. యెట్టి సత్యప్రచారమైనను యెవ్వరుపాటించరు. చూడుము.

సీ॥ అస్పృశ్యతను మాన్పు ♦ డార్యులారా యన్న
పలుకుల నెవ్వరు ♦ పాటిగొనిరి
త్రాగుడు మానుడో ♦ చంద్రులారా యన్న
పలుకుల నెవ్వరు ♦ పాటిగొనిరి
రాట్నంబు మనకు స్వ ♦ రాజ్య మిచ్చునటన్న
పలుకుల నెవ్వరు ♦ పాటిగొనిరి
కులభేదములమాని ♦ కూడియుండుటన్న
పలుకుల నెవ్వరు ♦ పాటిగొనిరి
గీ॥ అట్లెగురువులు ధనము ♦ నార్జించుటకును
పొట్టకూటికివత్తురో ♦ పొలతులార
వారిపాదంబులను బట్ట ♦ వలదటంచు
యెన్నివాగిన విందురా ♦ వెఱ్ఱివాడ॥

రంగా—వేసుగల యే పెద్దమనుష్యులకో నిరువురకు ముందుయెట్లో యుపదేశమిప్పించి వారిని చాటుజేసుకొని కొందరిచేప్పించుట కవకాశమున్నదిగాని మనవంటివారల మాటలు పాటించిమాత్రము చేయుటకష్టము.

లక్ష్మి—యే పెద్ద మనుష్యులు నక్కర లేకయే అనేకమందిస్త్రీలు యుపదేశమునొందుటకు సిద్ధముగానున్నారు.

రంగా—నిజమేకాని మొన్న తెనాలిగురువుగారు శిష్యురాలునే వెంబ్లాడుటయు, భజనమందిరమునకు పోవుచుంటిననని తెల్పివచ్చిన భద్రమ్మ పరారగుటయు, జరిగిన దగ్గరనుండియు భజనకంగీకరించిన పురుషులే నేను బయటకు రానీయుటలేదు.

లక్ష్మి—నిజముగా ఆస్త్రీలు మతిలేనివారు గాబట్టియే అట్లు లేచిపోవుట, కాకున్న నర్సయ్యగారి నంచుకొన్న ఆనాగభూషణమును పడుపువృత్తియే జీవనముగా బెట్టుకొన్న బ్రహ్మయ్యగారి పిల్లయు భజనలలోను పూజలలోను నిమామము కొదిగుచు గురుబిడ్డలలో పేరునొందుటలేదా? అంతవరకెందులకు నేనన్ని తాంత్రిక వ్యవహారములు జేయుచున్నను నీవు నీభార్య చెప్పచేతలలో తిరుగుచున్నను, గురుబిడ్డలమని పేరు గడించుటలేదా, పాపము ఇట్టి లౌకికముదెలియక ఇల్లువెడలి గురుబిడ్డలపేరు నశింపజేయుచున్నారు. సరే యీ పురాణములకేమి నీవు ఒక్కసారి గురువుగారిని తీసుకొనివచ్చి నాల్గుదినము లీప్రాంతమున బోధజెప్పించి కొంతప్రచారము జేయవలసియున్నది. గాన నీవువెళ్ళి వారినొక్కసారి వెంటబెట్టుకొని తీసుకొనిరమ్ము.

రంగా—నేనుమొన్ననే ఉత్తరముకూడవ్రాసినాను రేపుతప్పక బయలుదేరివెళ్ళెదను (కొంచెమాగి). అన్నట్లుమరచితిని. ఈనాగమణి విషయములో మనమనుకొన్న వ్యవహారమెంతవరకు సాగినది?

లక్ష్మి— నేనును ఆవ్యవహారముకొరకే విశ్వప్రయత్నము జేయుచున్నాను. ప్రస్తుతము ఇప్పటికి జరిగినపని ఆ వేంకటరావు నింటిచాయకు రాకుండ జేయించితిని. ఇక ఆపనికూడ జేసినదా! దాని ఆ

స్థితిలోనే మనవేదాంతమందిరములుగాని, భజనలుగాని సభలుగాని దిగ్విజయముగా సాగింపవచ్చును. కానినాయాలోచన దానిబుద్ధికింక పూర్తిగా యెక్కలేదు. అదిగో మాటలోనే నాగమణికూడా వచ్చుచున్నది. (నాగమణి ప్రవేశించును)

అమ్మాయీ! యిటుకూర్చుండుము. భోజనములయినవా?

నాగమణి— ఇప్పుడేతీరినవి. మీబావగారు పొలమునకు వెళ్ళినారు. నేనిటువచ్చితిని.

లక్ష్మి— మావేంకటరావు ఇప్పుడు ఎక్కడ భోజనము చేయుచున్నాడో!

నాగ— పెద్దబావగారియింటియొద్దనుండినాను నిన్ననేమో మనగురువుగారిగ్రామమునకు వెళ్ళినాడట.

రంగా— గురువుగారిదగ్గర కెందులకో?

నాగ— ఏమో ఇక సిద్ధాంతములన్నియు తెలిసెనుగదా అందుచేత సన్న్యసించుటయు అట్టి పరమార్థమును తెలిసికొనుటకై సద్గురువుల చేరుటయు వేదాంత గురువులు తెలుపుమార్గములు చెప్ప ఈకాలములో యేదిసత్యమార్గమో తెలిసికొనుటకై గురువుల వెదకుటకై వెళ్ళినాడని నాస్నేహితుడు పద్మనాభరావు చెప్పుచుండెను

లక్ష్మి— ఈగ్రామమునకే సాధుగురువులే వచ్చుచుండగ వారిగ్రామము పోవుట యేమిటికి?

నాగమణి— ఆచరణశూన్యులగు, గురువులనేకులు సత్యప్రచారమని గ్రామములవెంట తిరుగుచుండిరట, వారిప్రవర్తనలు వారిస్వస్థానముగాని తెలిసికొనను గురువుల యిండ్లకే వెళ్ళినాడట.

రంగా— (తనలో) సత్యమును బయలుపరచుటకై కంకణముగట్టుకొనిన వేంకటరావు ఈదొంగగురువుల నాటకముల బయల్పరచక మానడు. (తలపంకించుచు) అయినను ఈలక్ష్మమ్మ చెప్పినటులవీనిమాటలు నమ్మువారు మాత్రమెవరు.

లక్ష్మి— (నాగమణితో) చూచితివా వేంకటరావు పట్టుదల అతడంత పట్టుదలచేదిరిగి గురుసేవగోరినదెందులకు. కీర్తికేగదా? నీవు

గూడ గురుసేవఁజేసి, గురుని ప్రథమశిష్యురాలవై ప్రపంచమున కీర్తిసంపాదించుము

నాగ — నేనును యుపదేశముఁగొంటిని గదా, ఇంక చేయవలసిదేమి యున్నది. వారిక్కడకు వచ్చినప్పుడు గురుసేవ జేసుకొనుచుందును.

లక్ష్మి — యొందఱుపదేశముఁ గొనిన గురుపూజ చేయుచుండి శిశ్రూషజేసిన ప్రథమశిష్యునకు వచ్చు పేరు ఇతరులకెన్నడు రాజాలదు. చూడుము

సీ॥ గురుసేవగావించి కువలయంబున నెంతొ
స్థిరకీర్తిగాంచెనగా ♦ సిద్ధయాఖ్యు
డలరామకృష్ణునా ♦ నందంబుగాఁగొల్చి
యవివేకానందు ♦ డెలమినొప్పె
గాంధిశిశ్రూషచే ♦ గణియింపరానట్టి
స్థిరకీర్తిగనె నేడు ♦ స్లేడుకన్య
వరదేశికునిగొల్చి ♦ స్థిరమైన యశమును
ఘనవేమనాఖ్యుడు ♦ గనెడగాన
గీ॥ గాన నటువంటివారెల్ల ♦ కలియుగమున
తిరుగులేనట్టి యశముతో ♦ వరలలేదె
యట్టివారలె ముక్తిని నందవచ్చు
నమ్మరో నీవునట్లైమె ♦ లంగుమమ్మ.

నాగమణి — అక్కయ్యా నీవు చెప్పినది యదార్థమే, కాని, (అర్థోక్తి)

లక్ష్మి — ఏమి సందేహించెదవు. నా దుకాళ్ళ ముదుసలి గురువానిని గురించి విచారించెదవు కాని, అదియంతయును నీకువచ్చెడి కీర్తి నెరుగవు. నీకుచిన్నతనము, తెలియదు. అభర్తతో నిప్పుడు సుఖించుచుంటివిగనుక ముందునాశృంగారములు నశించుననుభయమా? నా మాటవినుము. వెలలేనికీర్తిని చేపట్టుము. ఏమనియెదవు. ఆముత్యామంత్రపనిజేసి, నీచే సర్వాధికారిణివై పూటకొకగురుని పూజింపుచు లోకులకు వారిచే బోధలుజేయింపుము, సర్వకాలము, నిట్లే దిరుగుచుండిన,

గీ॥ ఈమె ఈమెయె ఈభువి • నిందువదన
లందు మణియన కలిమిని • లచ్చియనగ
గురుల సేవించుటందును • గుణమునందు
భూరియశమందెనన రె పూ • బోణి నన్ను.

రంగా—నాగమణీ యేమిమాటాడవు?

నాగ—(తలవంచుకొని మెల్లగా) సరే మీయిష్టముమీద నే ప్రవర్తిం చెదను. నాన్నగారిని రానిండు.

రంగా—నాన్నగారికొరకై నేడేబోవుచుంటిని.

(తెరలో కందార్థిపుస్తకాలు కందార్థపుస్తకాలని కేక)

లక్ష్మి—ఓ అబ్బాయీ యిటురమ్మ (పుస్తకములవాడు వచ్చెను.)

(పుస్తకములు పరిశీలించుచుండ అవసికజారును)

---

మూడవరంగము.

---

—§ గంగమ్మ యిల్లు §—

(గురువు మంచముపైన కూర్చుండ గంగమ్మ పాదములనొత్తుచు కూర్చుని యుండును. తెర లేచును.)

గురువు— గీ॥ పరులకెన్నియొ నీతుల • బలుకవచ్చు
గుడిచి కూర్చుండి గురువంచు • గులుకవచ్చు
సమర భోగంబు లెన్నైన • సలుపవచ్చు
గాని గయ్యాళి మాటకు • గడువరాదు.

చేయునది మాత్రమేమి, అగ్నిహోత్రమువలె మండు దానికోపాన లము చల్లార్చువరకు తలప్రాణము తోకకు వచ్చినది.

గంగ—మాటలచేత మహేశు సంతతివానిని శిష్యుని జేసుకొనెడి మీకుయింటియిల్లాలి నిష్టము బడయుటకు వదలు సమర్పింపక దప్పి నదిగాదు.

గురు.—గంగమ్మా, వందలిచ్చెడి యొడంబడికకు దోడుపాదముల పై బడి బ్రతిమాలవలసి వచ్చినను జింతించను.

సీ॥ దశరథుడను రాజు ♦ తనదు భార్యకులొంగి
కన్న కొమరుని కాన, ♦ కనుపలేడె
శ్రీరామచంద్రుండు ♦ సీతమాటకు లొంగి
అనుజుమాటను మీరి ♦ యరుగలేదె
రుక్మాంగదుడు తొల్త ♦ రూపంబునకు లొంగి
పుత్రుని నరుకగా ♦ బూనలేదె
స్వామి శ్రీకృష్ణుని ♦ సత్య తన్నిన తాను
హితవుగా మదికి ♦ సహించలేదె.

గీ॥ యెంతవారలో సతిమాట ♦ కెదురు జెప్ప
జాలమికిలొంగి వారలు ♦ నలువమనెడి
పనులు జేయుచు సంతోష ♦ పడుచునుండ
నా మొగాన నె పుట్టినే ♦ నాతిపోరు.

గంగమ్మ—ఇంతకును గృహమునకు వచ్చు గురుబిడ్డలనైన సపర్యల జేసి సాగనంపునట్లు చేయగలిగితిరా?

గురు—బాహ్యప్రపంచమునకే యది భార్యగాని నిజమునకు నీ వేగదా! అది మర్యాదగా జూడనంతమాత్రమున వచ్చులోటేమి.

గంగ—అందులకుగాదు. తిండియైన బెట్టక తిరుగబడిన యట్టి కనకము మీకు లొంగునని కలనైన నేనుదలచలేదు.

గురు—నిజమున కట్టిదేగాని ఆడువారిని వశపరచుకొను వస్త్రములలో నొకటగు కనకాస్త్రమున దానిని కట్టివైచితిని.

గంగ—ఓహో, వచ్చెడి యాదాయముతో వస్తువుల చేయించుచుండెదనని ఒడంబడిక చేసుకొంటిరి కాబోలు.

గురు—సమయమునుబట్టి అట్టియొడంబడిక చేసుకొనక తప్పినదికాదు

గంగ—(సంతోషముతో) ఉపదేశముల నిచ్చువిరివిగానున్న యీకాలములో గురువులుగానున్న మీ యదృష్టమేమనవచ్చును?

గీ॥ తనదుపితరుల మిత్రసం ♦ తతులవీడి
క్షేమముఁ యక్రనయమోర్గి ♦ సీమకేగి
విద్యనేర్పుటకంబెను ♦ వేయిరెట్లు
దేశికుండడెనధనము సా ♦ ధింపవచ్చు.

గురు—(సంతోషముతో) యేదియొక్క ద్దు (గద్దియని మంచముపై గూర్చుండ బెట్టుకొని.)

ఓసీ పిచ్చిదానా, గురువులనుట మాత్రమంత పై పైనున్నదను కొంటివా!

సీ॥ కంధారములవేయి ♦ కంఠతావల్లించి
ప్రశ్నప్రశ్నకునవె ♦ పాడవలయు
నుపమానములుగాని ♦ యుపమేయములుగాని
తేపకొక్కటిజెప్పి ♦ తీరవలయు
మధ్యమధ్యను మంచి ♦ మధురతత్వముపాడి
వీనులకింపుగా ♦ వింపవలయు
సాంఖ్యవిచారణ ♦ సలుపుచో నడిగిన
ననుమానప్రశ్నలు ♦ నరయవలయు
గీ॥ నరసి సందేహములనెల్ల ♦ నాపివేయ
గల్గుచిత్రపుకథలెన్నొ ♦ కల్పనంబు
జేసి వారలవశపర్చి ♦ తేజరిలుట
మాటలా అట్టి గురుపాత్ర ♦ మగువమిన్న॥

గంగ—నిజమేగాని యొక సందేహము. ఆచరణలేక విద్యాబలముచే భగవత్తత్వమిట్టిదని నిరూపింపగల్గిన తన్మాత్రమున గలుగు లాభమేమని యడిగెడివారికేమని సమాధానమిచ్చెదరు?

గురు—పిచ్చదానా! ఈదినములలో భక్తులసంగతి పూర్తిగాదెలియక అట్లు మాట్లాడుచున్నావు. గురువని వచ్చినంతనే యేవో కొన్ని ప్రశ్నలనిచ్చి చక్కని యుపమానములతో వారిప్రశ్నలకు సదుత్తరములు ఇచ్చినవారిని పూజించుటదప్ప ఆచరణగాంచి పూజించెడివారు మచ్చునకొక్కరు గానుపించరు.

గంగ — రామరామ! పూర్వమొక్కప్పుడు ఋషిపుంగవుల చే యలరారిన ఆర్యావర్తనము రానురాను యీస్థితిలోనికి వచ్చినది.

గురు — దేశస్థితినిగూర్చి విచారించుటెందులకు? ముందు నీమాటజెప్పుము. నీవు గురువులయందలి యేసత్ప్రవర్తనగమనించి యీపదేశము నొందితివి?

గంగ — (సిగ్గుచే దలవంచుకొని) నామాటకేమి లెండు ప్రపంచముల్లరులకు వెరచి పగలు శిష్యురాలనుగా నుండుటదక్క భగవత్తత్వము దెలుసుకొనుటకై ప్రాకులాడుచుంటినా యేమి?

గురు — అదుగో నట్లుతప్పుకొనకుము. నీవెటులనో అందరునునంతియే.

గీ॥ నియమనిష్ఠలు జూడరు ♦ నిక్కమైన
నాచరణగాంచబోవరు ♦ నరయురెట్టి
సాంప్రదాయంబు నేడు నీ ♦ సర్వమునకు
యుక్తిమాటలవేవు నా ♦ లున్నచాలు

గంగ — సరికాని మరిలమీరు సంచారములకెప్పుడుబయలు దేరుదురు?

గురు — రావలసినదని రంగారావు లేఖవ్రాసినాడట, అతడు నేడోరేపో రావచ్చును. అతనితో గలసి వెళ్లి అచ్చటచ్చట తిరిగి పదిదినములలో (అర్థోక్తిలో)

గంగ — అదుగో మాటలోనే రంగారావుగారు వచ్చుచున్నారు (గంగమ్మ మంచముపైనుండిదిగి గురుపాదములొత్తుచుండును. రంగారావు ప్రవేశించినమస్కరించును).

గురు — పరిపూర్ణమైందెదవుగాక కూర్చుండుము ఇప్పుడేనా వచ్చుట

రంగా — అవును (కూర్చుండును)

గురు — రంగారావుగారూ! ఈ సంవత్సరముము మీ గ్రామములో రావలసిన వార్షికగురుకట్నములు కొరతగాబంపించితి నేమి?

రంగా — ఆర్థికదుస్థితిచేత కొందరివ్వలేకపోయిరి. వసూలయిన సొమ్ములో ఒకవంతుమాత్రముతీసికొని, తక్కినమూడువంతులుపంపించితిని.

గురు — ఏమయ్యా! క్రొత్తగా శిష్యులజేర్పించినదానిలో కొంత తీసుకొనుచున్నను వార్షికచందాలలో గూడావంతుదీసుకొనుటధర్మమేనా?

రంగా — నాన్నగారూ మీరిట్లనుట న్యాయముగాదు.

గీ॥ ఇంటిపనులెల్లమాని నా • యింతివీడి
యూరివారలహేళన • కోర్చుకొనుచు
చేడెలనుసీమశిష్యుల • జేయునాడు
భాగమివ్వకయున్న నే • బ్రతుకుటెట్లు?

గురు—(తనలో) నిజమునకు వీనిసండ జేసికొనియే ఆ ప్రాంతమందు సందరశిష్యులుగా జేర్పించుకొనగలిగినది. ఇప్పుడు వీనితో విరోధము బెట్టుకొన్న యిబ్బందిగల్గుట దప్ప వేరమెత్తు లాభము లేదు. (ప్రకాశముగ) రంగారావూ, నవ్వులాట కడిగి తినిగాని నీవొకటి యు, నేనొకటియునా?

రంగా—అట్లని నేనాదినుండి నమ్ముటచేతనే నాయావశ్శక్తి నుపయో గించి ప్రపంచమున మీగురుత్వమును వృద్ధిజేయుటకై ప్రచారము జేయుచుంటిని.

గురు—నాగురుత్వమును వృద్ధిజేయుచుంటిననుట పొరపాటు. ఈపీ ఠమునకు గురుదయానుసారముగా నేడునాకు గురుత్వమెట్లు లభించి నదో యట్లే రేపు నీకును రావచ్చునుగాన మనమందరమునుగల సి గురుపీఠమును వృద్ధిజేయుటదప్ప వ్యక్తిపరముగా నీ, నా, గురు త్వముల వృద్ధిజేసుకొనుటమాత్రముగాదు. ఈ విషయమును ము ఖ్యముగా జ్ఞప్తియుంచుకొనుము (కొంచమాగి) లక్ష్మమ్మగా రి గ్రామసమాచారములేమి?

రంగా— యేమిసమాచారములున్నవి. (అని సందేహించును)

గురు—యేమి సందేహింపుచుంటివి?

రంగా—(గంగమ్మగలదని సందేహము కంటితో సూచించును.)

గురు—గంగమ్మగారూ వీరికి త్వరగా వంటగా నిండు వీరెప్పుడు బ యలుదేరివచ్చిరో!

గంగ—(లేచి లోనికేగుచు) ఈ పండ భార్యతో జెప్పినవర్యలు చే యించలేక వచ్చుశిష్యులనందరిని నాయింటిమీదకు తగులుచుండ నేనేదో తినుచుంటినని వీనిభార్య నాపై బడియేడ్చును. (లోనికి బోవును.)

గురు—ఏమివిశేషములు?

రంగా—లక్ష్మమ్మ వారిగ్రామములో నొక భజనమందిరమును తమ పేరస్థాపించి ప్రచారముజేయ సంకల్పించినది. కాని ధనలేమిచే విచారింపుచు నాగమణిచేత ఆపని పూర్తిజేయింపదలపెట్టెను.

గురు—నాగమణి అట్టియుత్సాహముగల వ్యక్తియేగాని, ఆమెమాత్ర ము భర్త నెరుగకుండా అంతధనమెట్లు తేగలదు?

రంగా—ఆమెమాటకు చౌదరి యడుగుదాటడు.

గురు—భర్తయశక్తుడని వానిమాటత్రోయించి ఆమెను వశపర్చుకొని మందిరము కట్టించుకొనుటకు నెలలపర్యంతము గురుసేవచేయించు కొనుటకు అంగీకరింపజేసినను లోకుమేమనుకొందురు.

రంగా— ఆ విషయమాలోచించియే, ఆమె, పూర్ణస్వతంత్రరాలు అగుటకు మార్గమాలోచించితిని.

గురు— ఏ విధముగా

రంగా—(చెవులో రహస్యముగా చెప్పి) ఆపనిసక్రమముగా జరిగెనా నాగమణి మన యాజ్ఞలకడుగుదాటక నడచుకొనును, అధవాస క్రమముగా జరుగక విమఁించినను మనకువచ్చు ఉపద్రవము యేమియును లేదు.

గురు—సరే మీరుస్నానముజేసి భోజనముజేయుడు. నేడేబయలు దేరుదము.

రంగా—(స్నానమునకై పోవును.)

గురువు—రంగారావు చెప్పినట్లు నాగమణిచే చౌదరిని సాగనంపించి ఆమెను సర్వాధికారిణిగా జేయగలిగితిమేని అదృష్టమేమనవచ్చును

గీ॥ దానిధనముతో నాపేర ♦ ధర్మమనుచు
మందిరంబొందు గట్టించి ♦ మంచిభక్తి
గురులసేవింప ముక్తిచే ♦ కూరుననుచు
యింటిదాసిగ పనుల జే ♦ యింపవచ్చు.

(అవనిక జారును)

# కలికాల వేదాంతము.

## చతుర్థాంకము



—శ్రీ లక్ష్మమ్మ యిల్లు శ్రీ—

(గురువు లక్ష్మమ్మలు మాట్లాడుచుందురు)

గురువు—లక్ష్మమ్మా నాశిష్యురాండ్రలో పరిపూర్ణమిచ్చినది నీకొక్కర్తెకేసుమీ.

లక్ష్మ—నాన్నగారూ పరిపూర్ణమొందినవారు యెట్లు ప్రవర్తించవలయును

గురు—బిడ్డా, యెట్టివారికైనను పరిపూర్ణముదొరకుట కష్టము. పరిపూర్ణుడనగా పరమాత్మతో సమానుడనుమాట. అట్టివానికి మానాభిమానములు సుఖదుఃఖములు. సమానముగానుండును అట్లుండుననుటకే పరిపూర్ణమిచ్చునాడు దిగంబరుంజేయుట, దీని కుపమానముగా వేమన్నయు,

ఆ. వె. తల్లిగర్భమునుండి • దాబుట్టునప్పుడు
మొదలుబట్టలేదు • తుదను లేదు
నడుమబట్టకట్ట • నగుబాటుగాదొకో
విశ్వదాభిరామ • వినురవేమ.

అని సెలవిచ్చినాడు, కాబట్టి పరిపూర్ణముబొందినవారు యెట్లుప్రవర్తించినను తప్పులేదు.

లక్ష్మ—(సంతోషముతో) నాన్నా! ఇట్టి అమూల్యమైన పరిపూర్ణమిచ్చి

నందులకు ఆజన్మాంతము మీకు సేవకురాలనై పడియుండెదను. (కొంచెము సేపు పాదములొత్తి) నాన్నగారూ నాగమణికికూడ పరిపూర్ణమిచ్చి తృప్తురాలనుజేసిన బాగుండుననుకొనెదను.

గురు—పనిజరిగిన వెనుక పరిపూర్ణములెన్నియైనను నీయవచ్చును నీవు మాత్రము పరిపూర్ణమిప్పించెదనని పలువిధముల నచ్చజెప్పి పని జరుగునట్లు ప్రయత్నింపుము. (కొంచెమాగి) అన్నట్లు మరచితిని, నాగమణి మారుటుకొమరుడట వెంకటరావనునతడు మాగ్రామ మువచ్చి పెద్ద బహిరంగసభ జేసి సభలోనికి నన్ను బిలిపించినన్ను కొన్ని ప్రశ్నలువైచి హేళనపరచినాడు, మరియు వేనవేల గురు వుల దర్శించితిననియు, వారు చాలా నీచముగా ప్రవర్తింపుచుం డిరనియు మరేమేమియో యుపన్యసించినాడు.

లక్ష్మి—అతను మీగ్రామమేనననేల గురుతిరస్కారమే ప్రధాన కా ర్యముగా పెట్టుకొని గురువుల దర్శింపును వారిమర్మముల గ్రహిం చుచు వారి నీచప్రవర్తనల విచ్చలవిడిగా లోకమున ప్రబోధము జేయు చున్నాడు.

గురు—లక్ష్మమ్మా, ఒకరహస్యము. అతనిని లోబరచుకొనుటకు నే దైనను మార్గమాలోచింపక పోయితివా?

లక్ష్మి—కించిత్తు లోపమున్న బ్రహ్మదేవుడే అతనిని లోబరచుకొను టకష్టము. కాని నేను సాధ్యమైనంతవరకు వానిపై నిందలుగుప్పుచు నాగమణిచే ఇల్లువెడలగొట్టించితిని. అంతకంటె నేజేయదగినదే మియు గన్పించుటలేదు.

గురు—అతడిప్పు డెచ్చటనుండెను?

లక్ష్మి—నిన్ననే యీగ్రామమువచ్చినాడు, చాల కృశించియున్నాడు. మీరు వచ్చినవిషయము దెలసిన బహుశా యిక్కడకుకూడ రావచ్చును.

గురు—(భయముచే) ఇచ్చటకూడా మరల గందరగోళము జేయునా యేమి.

లక్ష్మి—నాయింటిదగ్గరమాత్ర మట్టిదేమియు జరుగదు. అదిగాక ఇట్టి

వారలనేకులు యుపన్యాసములమూలమునను, పత్రికలమూలము నను, ప్రచారముజేయుటలేదా? అంతమాత్రమున మనసంఘములు నశించునాయేమి (చూచి) అదుగో గురుబిడ్డలతో రంగారావుగారు వచ్చుచున్నారు (రంగారావు, నాగమణి, చౌదరి మరికొందరు ప్రవేశింతురు).

లక్ష్మి—యేమి రంగారావుగారూ, ఇంత ఆలస్యముగా వచ్చితిరి.

రంగా—నాగమణియింటిదగ్గరనుండి యిప్పుడే బయలుదేరితిమి,

నాగ—(లక్ష్మమ్మచెవులో) నాకు పరిపూర్ణమిచ్చుటనుగురించి నాన్న గారు యేమనిసెలవిచ్చినారు.

లక్ష్మమ్మ—పనిజరుగనిండు. పరిపూర్ణమునకేమిభాగ్యము సెలవిచ్చి నారు.

గురు—బోధ ప్రారంభించబోవుచున్నాను యింక నెవరైన రావల సినవారున్న పిలిపింపుడు.

వేంకటరావు—(ప్రసాదరావుతో కలసివచ్చి) ప్రసాదరావుగారూ ఈదొంగగురుబోధలు వినవలయునని కుతూహలముతో నున్నా వుగదా. అదిగో బోధనాటకము జరుగబోవుచున్నది. ఇటకూర్చు ని శ్రద్ధగా నాలకించుచుందము. (గురువు భయముచే లక్ష్మమ్మ నాగమణులు కోపదృష్టితో వీరల జూచుచుందురు)

రంగా—నిర్వికారనిరంజన స్వరూపులగు సద్గురువరేణ్యా! జడస్వరూ పకులమగు మావంటి మూఢుల అజ్ఞానమును మీవంటిగురువులే నశింపజేయ సమర్థులు.

కం॥ మొద్దులనైననుదొల్తురు
బద్ధులబంధత్వ మడవివాల్జేతురు మీ
వద్దకువచ్చినగని పరి
శుద్ధవు బోధోక్తమైనా సూక్తులుజెప్పీ॥
అందుకుదగినా యుక్తులుగప్పీ
పెద్దలచే నీప్రసిద్ధివినివచ్చితి
దిద్దుడీనేవట్టిబుద్ధిహీనుడనన్ను॥ సూక్తులుజెప్పీ॥ అం॥

గురువు — సన్మార్గ సద్భక్తి సద్గుణస్వరూపులగు రంగారావుగారూ. మీ రడిగిన ప్రశ్న చాలప్రశంసనీయమైనది. కాన మద్గురుదయాలబ్ధ జ్ఞానమును నాయనుభవమునుగలిపి

కం॥ మొదలచలము నెరిగించెద
విదితముగా లేనియెరుక ♦ వివరింతుపయిన్
దుదకెరుకను విడిపించెద
మదిలో నామాటనమ్మి ♦ మరియుంటివే నీ
సందియబుద్ధి మానుంటివే నీ
పదుగురు నినుజూచి ♦ భళిశబాసీత్రోవ
యెదురులేదనునట్లు నిదిగో నేజేసెద
మరివింటివేనీ సంశయబుద్ధి ॥మానుంటివేనీ॥

రంగారావు — తమరుఅట్టిసమర్థులని జగద్విఖ్యాతిని వినియే మీ పాదములవద్దజేరితిమి గాన

కం॥ తానవెవస్తువుయెట్టిది
నేననగానెవరుదీని నెరిగింపుము ఈ
మేనెటుల జననమాయెను
మానక యీమర్మమెల్లా ♦ మరిదెల్పుమయ్యా
నామదికిదీస్థిరపరచవయ్యా
పరివరి విధముల ప్రబలెనందేహములు
తిరిగిపుట్టాకుండ ♦ తీర్మానపరచియు
మరిదెల్పుమయ్యా ॥నామదికి॥

నాయీ ప్రశ్నలకు చక్కని యుపమాన,యుపమేయములతో యే సాధనచేసిన పరిపూర్ణముజెందవచ్చునో తెలుపుమగోరుచున్నాను.

గురువు— క॥ యేసాధననీకెందుకు
యీసానికి బసికిరావు ♦ వినుమాయయ్యా
నేసాధులచేవిన్నది
యేసాధనలేని బోధా ♦ యెరిగింతుబోకూ
సాధనలందుమరిగి తేరాకూ

యేసాధనలజోలి • యేనొల్లాననినీవు
బానాజేసితివేసి పరిపూర్ణ మెరిగింతు ॥యెరిగంతు॥

ఆత. బిడ్డలారా మీరు లేసాధనలజోలికి బోక నామాటపై నాధార పడెదమని ముందుశపథము జేసిన పరిపూర్ణ బోధయెరిగించెదను. లేకపూజాదితంతులపై మీకు ప్రీమగలదేని వానినే చేసుకొనుచుండుడు. వ్యర్థముగా మాత్రమునన్నుశ్రమపెట్టకుడు.

రంగా— నాన్నగారూ

కం॥ యెన్నో దేవతపూజలు
యెన్నోజపములను మరియు • యెన్నోతపముల్
యెన్నో యోగాభ్యాసము
లెన్నెన్నోజేసి మోక్ష • మెరుగ లేనైతీ
మనసును నేమానరుక లేనైతీ
పరువడీ శాస్త్రములు పఠియించితిని మాయ
గురువులతో గూడి • గుణములు దురకపోయె॥ యెరుగా లేనైతి మనసును॥

నాన్నగారూ పూజాదితంతులు జేసి, విసికియే మీపజ్జ జేరితిమి గాన మీబోధను వినిపించ ప్రార్థింపుచున్నాము.

గురువు— బోధవినిపించెదనుగాని మీరు మాత్రము ఒకమానవుని చే బోధజెప్పించుకొనుచుంటి మనుకొనుట మహాపరాధము. బోధ జెప్పినవానిని యెట్లుజూడవలెననగా

కం: గురుడు నరుడనుచు దలచిన
గురుమంత్రము మరచియున్న • గురుపుత్రులనా
దరణయొనర్పక • యుండిన
గురువును విడనాడిరెండో • గురుని చేరిననూ.
సద్గురుబోధా యెరిగిదూరిననూ
యెరుక మహాత్మ్యమూ • యెరిగినయిటువంటీ
సమునకూతప్పదు • నరకము మరియొక్క • గురుని జే॥

కావున మీరు గురువులనరునిగా భావించరాదు. ముందు ఈశరీరము యెట్లుత్పత్తియైనదో యెరిగించి, తదనంతరము పరిపూర్ణ

ముందు మార్గముజెప్పెదను. గాన శ్రద్ధతో వినుచుండవలయు
ను. లక్ష్మమ్మా, కొంచెముమంచితీర్థమిమ్ము,(లక్ష్మమ్మ యివ్వ తా
గుచుండును)

వేంకట—(అపహాస్యముగా) ప్రసాదరావుగారూ! కాంచితిరా వీరినాట
కము. ఇకపోదమురండు.

ప్రసాద—ఆనందముగా నున్నది. మరికొంతవినియే వెళ్లుదము.

వేంక—యేమి వినవలయునని మీయభిప్రాయము బోధనాటక
మునకు ప్రధానాంశము అయిపోవనే పోయినది. యికజెప్పునది
గురునిసేవింపుచు కష్టములు జెల్లింపుచుండిన పువ్వులజీల్చుట కం
టెను, కనురెప్పల మూయుటకంటెను, కైవల్యముదొరుకుట తేలి
కయనిచెప్పను. గాన వెడలుదమురమ్ము.

ప్రసా—(లేచి లోపలికిజూచి) ఆ ఫలహారములన్నియు యెందులకిటు
దెచ్చుచున్నారు.

వేంకటరా—యెందులకా? గురువులారగింపులకు. రమ్ము. వెలుపలకేగి
మాట్లాడుదము.

(ఇరువురు ముందుకురాగా వెనుక తెరబడును.)

వేంకట— సోదరా! ఈగురువుల బోధలు ఫలహారములు గాంచియే
నీవాశ్చర్యపడుచుంటివి. ఈ దంభగురునాటకముల గుర్తింపవలెన
న్న ఆంధ్రరాష్ట్రమునను అందును కృష్ణా గుంటూరు మండలము
లలోవలను జూడవలెను. పొట్టజీల్చిన అక్షరము గానుపించని నిర
క్షరకుక్షులును,గృహభారముచే సంసారము పోషింపలేక పొట్టకూ
టికై బయలుదేరు పాషండులును, కందార్థములువచ్చిన కైవల్య
మువచ్చునను కంటకులును, ముసలితనమున మూడవపెండ్లికై నవె
నుదీయుని వెధవలును, జిహ్వాచాపల్యము జెందరాదనుచు చుట్టపీ
కలను వీడలేని ఘంతలును దప్ప,నిష్కల్మషచిత్తముతో చెప్పుదా
నిని జేయు నియమమున నుండువారుమాత్రము నాకెచ్చటను గా
నుపించలేదు.

ప్రసాద—సోదరా!

గీ॥ ఆచరణ యించుకయు లేక ♦ యధములగుచు
ముష్టితత్త్వాలు బాడుచు ♦ ముక్తిమీకు
సాంఖ్యతత్త్వంబు దెలసిన ♦ సాధ్యమనెడి
గురునిదరిజేర నేల నీ తరుణులెల్ల॥

వేంకట—(క్రోధముతో) ఛీ, ఛీ, సత్కర్మ మించుకైన లేక మాటలచే మాయజేసి ధనమునకై తిరుగు ఈదరిద్రపుపెద్దమ్మల నెవరుగురువుగా నంగీకరించినది.

సీ॥ జిహ్వాచాపల్యంబు ♦ జెందరాదని జెప్పి
చుట్టపీడని ముట్టి ♦ శుంఠలకును
ఆత్మబిడ్డలటంచు ♦ నాదరించుచు రేయి
సంపర్కమును గోరు ♦ చవటలకును
మగని గాంచినయంట ♦ మంచుచుండెడి యట్టి
గయ్యాళిగంపలౌ ♦ కాంతలకును
వ్యభిచారవృత్తిని ♦ వ్యాపారముగ బెట్టి
మాపుకోజూచెడి ♦ పాపులకును
గీ॥ గురువు శిష్యులమంచును ♦ గూడియాడ
తగును వారికె గాక యే ♦ తరుణికిట్టి
తులువగురువుల నామంబు ♦ దలచి మ్రొక్క
విమలతరమైన భర్త నా ♦ మమును విడచి॥

ప్రసాద—యెక్కడను దొరకకున్న నక్కమగడే దిక్కన్నసామెతగా నెచ్చటగాంచినను యిట్టి పందలే గురువులుగా బయలుదేరుచున్న నీకాలమున, పాపమా స్త్రీలుమాత్రమేమి జేయగలరు, ఈ గురువులే దైవస్వరూపులనియు, కందార్థములే తారకోపదేశములనియు, పరిపూర్ణమందులే పరబ్రహ్మైక్యమనియు, నమ్మి చెడిపోవుచున్నారు.

వేంకట—నిజమునకు నీవు చెప్పునదియు కొంతసత్యమే. నిజగురువుల దర్శింప సంవత్సరమునుండి తిరుగు నాకే కల్లగురువులుదప్ప కలి

కమునకేని సద్గురువు లభించనపుడు, పాపమాత్రులకుమాత్రమె చ్చట లభింతురు. (దీనముగ) ఓ దీనబంధూ! ఈదీనునకు, ఈయాధారసూన్యునకు, ఈనిర్భాగ్యునకు, సద్గురువు దర్శనము లభింప జేయవా? ఓ పరాత్పరా! సాటిలేని ఋషిపుంగవులచే నలరారిన ఆర్యావర్తనమున నేను సర్వపవిత్రుని మచ్చున కొక్కనినైన కనుభాగ్య మలవడజేయలేవేమి. ఓ దయామయా ఈ దరిద్రుని మొరాలింపవా.

గీ॥ పసితనంబున తల్లిని ♦ బాసి మూరు
తల్లి బెట్టెడు బాధల ♦ దలకుకొనుచు
పరులపంచలనుండెడి ♦ భ్రష్టునైన
నన్ను బ్రోవగ రావె య ♦ నాథనాథ॥

ప్రసాద—సోదరా! దుఃఖింపకుము. ఈకలికాలమున కల్లగురువులను దప్ప కార్యము సాధించు దేశికుల దేవదేవుడు సృష్టింప నిష్టములేక ఈయుగమున కిట్టి చండాలురనే సృజించుచుండెనేమో?

వేంకట—ప్రసాదరావూ! భ్రమపడుచున్నావు. కలియుగమునందైన కావలసినంతమంది కైవల్యప్రాప్తి జెందినవారుగలరు. చెందువారునుగలరు. అందు ముఖ్యులు ఆదిశంకర మధ్వాచార్య రామానుజాచార్యులు అంతవరకేల? మొన్న మొన్న మోక్షలక్ష్మిని జూరగొన్న రామకృష్ణవివేకానందులును, బ్రహ్మాండ భాండపు బ్రతుకు దెరువులతోట తెల్లముగా జెప్పిన బ్రహ్మముగారును, నేడు గృహస్థధర్మముల వీడక నిష్కామయోగమును నిష్కళంకముగ జనకునాదర్శముగ బెట్టుకొని, పవిత్ర ధర్మముల నెరవేర్చుచు ప్రజలకు బోధజేయుచున్న మహాత్ముడును, నాల్గు వేదములలోని నాణ్యమైన విషయముల తేట తెనుగున ఆటవెలది పద్యముల నాపరమాత్మతత్వమును తెలియజేసిన వేమనయోగి సార్వభౌముడును, (తన్మయముగ) ఓహో ఇట్టిసమయమున యెట్టి మహానీయుని పేరు జ్ఞప్తికివచ్చినది. ఓ వేమనయోగి సార్వభౌమా వేమనార్యా, నీపవిత్రనామాక్షరములదలచి ఆనందింపనివాడు

(ఒకయోగి ప్రవేశించును)

యోగి—నేనీ మాటుననుండి మీరిసంభాషణ విన, విన, నిశ్చలభక్తితో భగవంతుని జేరనిచ్ఛగలిగిన వేంకటరావను వానికి, యెచటగాంచినను బూటకసాంఖ్యగురువులు దప్ప వేరొకరు గనుపించకపోవుటచే, దుఃఖమున పరితపించుచున్నటులుం దెలియుచున్నది. ఇప్పుడు వీనిని మాయాశ్రమమునకు దీసుకొనిపోయి, యోగాసన ప్రాణాయామాదులచే భగవంతుని చేరవచ్చునను మాటలచే తృప్తిపరచి నాశిష్యునిగా జేర్చికొనెదను గాక. [దగ్గరకు వచ్చుచుండ ప్రసాదరావు జలముతో ప్రవేశించి యోగికి నమస్కరించి]

ప్రసాద—దేవా! నీవు యుమ్మద్ధరింపవచ్చిన అవతార పురుషునివలె గన్పించుచున్నావు, స్వామీ! నాసఖుని మూర్ఛదేర్చి రక్షింపవేడుచున్నాను.

యోగి—అబ్బాయీ, భయమందకు ఆజలమును మొగముపై చల్లుము

(ప్రసాదరావట్లు జేయును.)

వేంకట—(మూర్ఛదేరి యోగినిగాంచి) నన్నుద్ధరింపవచ్చిన వేమన సార్వభౌమా! రక్షింపుము, రక్షింపుము. (కాళ్ళపై బడును)

యోగి—(లేవదీసి) నేను వేమన మార్గానుచరుడనుగాని వేమన్నను గాను, అబ్బాయీ, నీపరితాపము నాకర్థమయినది. ఈదినములలో ముప్పూట పంచభక్ష్య పరమాన్నములు పొట్టనిండ మెక్కి ధన సంపాదనకై తిరుగు ఈ దరిద్రదేశికులు మాత్రమెన్నటికి ఆవరమాత్మతత్వమును కనుగొనజాలరు. నీవుమా యోగాశ్రమమునకు వచ్చిన అట్టి అమూల్యతత్వమార్గముల జూపెదను. ఓపిచ్చివాడా నీవు పూర్ణఅమాయికునివలె కనబడుచున్నావు. కాకున్న

సీ॥ సాత్వికవస్తువుల్ ♦ చవిచూడ లేకున్న
హఠయోగ దీక్ష యుం ♦ దాగు టెట్లు
ఆసనాదిక ముద్ర ♦ లభ్యానపడకున్న
రోగ సామ్రాజ్యంబు ♦ రోయుటెట్లు

తత్త్వ చింతనజేసి ♦ తధ్యంబు గనకున్న
నిత్య సన్న్యాసంబు ♦ నిలువ దెట్లు
స్థిరలక్ష్య మూనిస ♦ ద్గురుబోధ వినకున్న
షట్కర్మహానంబు ♦ సలుపు టెట్లు
గీ॥ నిశ్చలత గల్గి సృష్టితో ♦ నిజమెరింగి
శుద్ధిగనకున్న జన్మసం ♦ సిద్ధి యెట్లు
మాయ గురువుల బోధల ♦ మాయవిడచి
రమ్ము నావెంట యోగము ♦ రమ్యంబు లెసంగ.

వేంకట—స్వామీ అందులకు సిద్ధముగానే యున్నాను. (ప్రసాదరావుతో) సోదరా, ఈజన్మ తరింపను మార్గమునకై వెదకి వేసారిననాకుయీమహాత్ముని వలుకులచే కొంచెము జ్ఞానజనించుచున్నది. ఇకనాకు ఆశ్రమమున కేగ సెలవిప్పించ గోరుచున్నాను.

ప్రసాద—(కౌగలించుకొని దుఃఖముతో) సోదరా! ఈసర్వాభాగ్యహీతుని విడనాడిపోవుచుంటివా, అయ్యో నేనుఇట్టి అమూల్యమిత్రరత్నమును, నిరంతర సత్యమార్గాన్వేషిని విడనాడి ఈజీవనము లెట్లుభరించువాడ, నెల్లపుడు పదుగురిలో దిరుగు నీకు అరణ్యమున ఆశ్రమ జీవితమని వ్రాసిన నావిధి నేమనవలయును?

వేంకట—సోదరా, జ్ఞానస్వరూపుడవైన నీవేయిట్లు దుఃఖింపుచుండ ఇక నేనేమిదెల్పి నిన్నోదార్పగలను. ప్రసాదా!

గీ॥ ధనము విధిబడిన ♦ దైవవశంబున
నుండు బోవు మూల ♦ నున్ననైన
నడవి రక్షలేని ♦ యుబయుండు పరిలు
రక్షితుండు మండి ♦ రమునజచ్చు॥

అను భాగవతరీతి నెరింగిన నీవేయిట్లు దుఃఖింప నేనేమనందును?

యోగి—మీ యపూర్వస్నేహలతను, త్రెంచుకొనుటకు యెన్నినంవత్సరములైనజాలదు. కాబట్టి త్వరలో విడిపోవుట యేమంచిది.

వేంకట—సోదరా, (కౌగిలి విడిపించుకొని) ఊరటజెంది యిచ్చటనే యుండి సత్యస్వరూపుడగు నాతండ్రిక్షేమ మారయుచుండుము.

సెలవు, ఇక నేబోయివచ్చెద. (అని రెండడుగులు వేయగా మరల ప్రసాదరావువచ్చి హా సోదరా యని కౌగలించుకొని యిరువురు హా సోదరా హా సోదరా యని దుఃఖించుచుండ నవనిక జారును.)

రెండవరంగము.

——:O:——

—§ నాగమణి యిల్లు. §—

——

నాల్గవ పూట.

(నాగమణి కూర్చునిఆలోచించు చుండును.)

నాగమణి—

చ॥ కలిగిన యవ్వనంబుకును ♦ కాంతలలో సరిగాకయీజరా
నులినపుమోట మానిసిని ♦ భర్తగ నామెడ గట్టుకొంటి, నా
సలలితదేశికాఖ్యుపద ♦ సారసమంటితి నిందునేదిన
న్నిలఘనమోక్ష మార్గమున ♦ సిష్యులజేర్చు నోగాన గావలెన్.

భర్తల భక్తిచే పూజలుచేసిన మోక్షమువచ్చునని శాస్త్రములలో చెప్పియున్నదని చెప్పుకొనుటదక్క, నిప్పుడుప్రత్యక్షముగా నెచ్చటను పతివ్రతాస్త్రీల చరిత్రలనే వినియుండలేదు. నిజమునకు భర్తలపూజించిన మోక్షమునచ్చుననుటకల్ల. లక్ష్మమ్మ చెప్పినట్లు మోక్షమునకు పోవునంతటి మహాత్మ్యగలిగినవారు లోకముచేగూడ పూజింపబడుదురనియు, నిప్పుడునేస్త్రీయు నట్లులోకముచే పూజింపబడుట లేదనియు, కాబట్టి భర్తపూజలచే మోక్షము వచ్చుననుట బూటకము, మోసము, ననియును, పురుషులేస్త్రీలచే, సేవచేయించుకొనమరిగి యిట్లికట్టుబాట్లనుంచిరనియు, యిక గురుపులును గురూపదేశికులును, ప్రపంచముచే పూజింపబడుచున్నారనియును, వీరు మోక్షమునకుగూడ పోవుదురనుట కిదియే గుర్తనియు, కాబట్టి

భర్తలపూజించి వారలకులొంగి, ఆజన్మాంతము వారిచెప్పుచేతల
లోమెలగి చివరకు సుఖమింతయైన లేక నశించుటకంటె, వ్యక్తిగల
స్త్రీ ఈభర్తలత్యజించి, వీరలకుజేయుసేవలో నూరవవంతైన గురు
వులకులొంగి వారలకట్టుబాట్లలోనుండిన ప్రపంచమున ప్రజలచే
వేదాంతురాలనియు మహాత్మురాలనియు పూజింపబడవచ్చునని
యు, ఇక మోక్షమువచ్చుననుటకు ఈప్రజాపూజయే తార్కాణము
నియు నొక్కిచెప్పినది. నేనును ఆలోచించినకొలదియు నదియే తే
లుచున్నది. భర్తనుభక్తిగాపూజించిన పతివ్రత యిదియనిలోక
మున నొకర్తెయైన పూజింపబడినట్లు నేను కని వినియుండ
లేదు. కాని యెట్టిస్త్రీలైనను యుపదేశికురాండ్రై పరిపూర్ణ
మును బొందినంతనే ఉన్నగ్రామములో గాకపోయినను
పొరుగూళ్ల యందైన పేరుప్రఖ్యాతులు గణించినవారి న
నేకమందిని నేనెరుగుదును. ఆహా! పరిపూర్ణమన నెంతటి మ
హాత్మ్యగలదియోగదా. ఆపరిపూర్ణమునందు యెంత మహాత్మ్యలే
కున్న ఆపరిపూర్ణము నొందినంతనే యెట్టి నీచకార్యములజేసిన
స్త్రీలైనను ప్రపంచమున ప్రఖ్యాతిని బొందుచున్నారు. భర్తసేవ
యా? పరిపూర్ణమా? మోక్షమిచ్చునదని వితర్కించిన(మహానంద
ముతో) యింకవితర్కమేల, కనపడుచునేయున్నది. మహాసాధ్వి
యై భర్త చెప్పుచేతలలో మెలగి భర్తచే నానాకష్టములంది
యెందరిల్లాండ్రు క్రుంగి కృశించి కుమిలి దుఃఖింపుచున్నారు.
లోకమున వారలపేరెత్తువారొక్కరైన గలరా. పతిసేవయట, పతి
సేవ. యెందులకు పతిసేవ తన్నులుదినుటకును కృశించిపోవుటకును
చివరకు ఉసూరుమని ప్రాణములు వదలుటకును దప్ప లో
కమున ఒక్కరిచేతనైన పూజింపబడుదురా. పరిపూర్ణమట్టిదా
పరిపూర్ణమునం దెంత మహాత్మ్యమున్నదో పతిసేవయం దంతనీచ
మున్నది. ప్రస్తుతము కనబడుచున్న విషయము గమనించరాదా
పతిసేవ మోక్షమిచ్చునను వెఱ్ఱినమ్మకముచే ప్రక్కయింటివారికై
నను తెలియనీయక భర్తచేకష్టములందుచు గృహమును నరకము

లోబడి యెందరు కృశించి, కృశించి నశించి పోవుచున్నారు. ఇక పరిపూర్ణ మహాత్వమందమా,

సీ॥ వెంకమ్మభర్తకు ♦ విషమిచ్చిగురుజేరి
నెనలేనికీర్తి గ ♦ ణింపలేదె
కమలమ్మభర్తతో ♦ కలహించివిడిపోయి
వేదాంతియైభువి ♦ వెలయలేదె
లక్ష్మమ్మపతిమాట ♦ లక్ష్యంబుసేయక
యింటనేభజనలు ♦ నిలుపలేదె
వర్ధమ్మయేవేళ ♦ పరునితోగూడుచు
భజనలందునకీర్తి ♦ బడయలేదె

గీ॥ యిట్టి వారలు గణియించి ♦ నట్టి కీర్తి
నెవరు లోకానబొందిరి ♦ యెంతచూడ
పుస్తకంబులలో పతి ♦ పూజజేయు
నాతికిలకీర్తి నిలుచను ♦ వార్తలకును
అర్థమున్నదె చూడ ♦ యుదార్థముగను.

కాన నిక నాలోచనల గట్టిపెట్టి గురువు త్వరలో పరిపూర్ణ మిచ్చి మోక్షమునకు బంపు ఆశక్తితో నాపైన నిరుపమాన ప్రేమచే నీగంగమ్మచేత నంపించిన విషము ప్రయోగించి భర్తయును నాపెనుభూతమును మారణమొనర్చి త్వరలో గురుకరుణకు పాత్రురాలనై లక్ష్మమ్మవలె నేనును పరిపూర్ణమొంది ప్రపంచమునకీర్తి గడించెదను (కొంచెము ఆగి) నేడేలనో యింకను రాలేదు. కారణమేమైయుండును (అన్నవదనుడై చౌదరి ప్రవేశించి మంచములో కూలబడును.) యింక ప్రొద్దు పోలేదనియా కూర్చుండిరి.

చౌదరి—నాకీపూట భోజనమవుసరము లేదు. తలనొప్పిగానున్నది. (పండుకొనును)

నాగమణి—యిదేమి భోజనము వలదనుచున్నాడు. ఈ దినముదప్పిన ఈ పనిచేయుటకు వీలులేదుకదా. కానిమ్ము భోజనమువలదన్నను పాలుకాగినవెంటనే పాలలో గలిపి పాలనైన తప్పక త్రాగిం

చి తీరవలయును. (అని లోనికేగును.)

చాదరి—(ఆలోచనతో లేచి మంచముపైకూర్చొని)

చ॥ తరుణమునందుభార్యసుర ♦ భామము జేరుట కూన వేంకటే
శ్వరుని మదీయపాదముల ♦ బంధనవేయుటసంతమీాదనీ
జరభరమందు నీశిశువు ♦ నాకగ లేకను పెండ్లియాడియా
తరుణికి దాసునైసుతుని ♦ దాటగనంపితి దేశభ్రష్టుగాన్॥

ఆహా ఇంకనా కష్టములు కడ తేరునా, కడ తేరవు కడ తేరవు. నిక్కముగ కడ తేరవు. యువతిమునుముందుశుభమిచ్చుటకై వచ్చెడి కష్టము లేయైన ఈ ముసలితనమున నిన్నికష్టములు వచ్చునా. అయ్యో, ఎంత నేరని. ఈ కష్టము లన్నియు స్వయముగా గావలెనని కోని తెచ్చుకొన్నట్లు, ఈ రెండవ భార్యయైననాగమణి యనునాగుబాము ను నాకంఠమున తగిలించుకొని యిప్పుడు యేడ్చినను మొత్తుకొన్నను లాభ మేమి? వేంకటరావూ! ఓ వేంకటరావూ. అయ్యో కొమారా నిన్నెంత యుగ చాట్లపాలు జేసితినిరా? అన్నిపథముల పైకి రావలసిన బాలుడ వగు నిన్ను దేశభ్రష్టుని జేసు, ముసలిమొరడు నైన నేను, కాటికి కాళ్ళు జాచుకొన్న నేను, రెండవ పెండ్లియాడి, మూండుటితల్లియను చురకత్తిని నీకుత్తుకపైకి దెచ్చితిని. నిన్నిన్ని కష్టములలో ద్రోయకారకు లెవరు? నీపినతల్లిగాదు. సూక్ష్మముగ నాలోచించిన నేనే, పుత్రఘాతకుడను. కుమారా నీయట్టి వినయసంపన్నుడు పుత్రుడయ్యు దేశభ్రష్టుడైన వార్తవిని నాహృదయము వ్రక్కలుగా లేదేమిరా? నాహృదయము మొకపాషాణము. కాదు కాదు వజ్రము. ఓ దేవతులారా! మీారందరు కరుణించి నిష్కల్మషహృదయుని సత్యప్రవర్తకుని పశిపాపని, నాకన్నపుత్రుని, దేశభ్రష్టుని జేయుటకు కారణుడనైన నన్ను నశింపజేయుడు. నశింపజేయరా? యేల మాటాడరు. ఓ భగవానుడా. నీవెంతకునైన జాలుదువయ్యా. జరాభారముచే శరీరము కృశించి శిరఃకంపనముచే మాటాడజాలని ఈనిర్భాగ్యుని నింత దుఃఖింపజేయుట ధర్మ మేనటయ్యా, ఓ దీన

బంధూ, నన్నొక్కసారి వేయివిషసర్పములచే గఱపించి చంపుము. యేల చంపును ఆదేవదేవుఁడు నేనశించుట కొప్పుకొనఁడు. కారణ మేమో? నేనే నశించిన ఈ దుఃఖము లన్నియు భరించు నిర్భాగ్యుఁ డేఁడీ? గాన ఇక భగవంతుని కోరను. ఓ నాగమణీ ఇటురమ్మా. నీవే నా దుఃఖముల నశింపజేయు సమర్ధురాలవు. ఇతి సుకుమారహృదయుఁడగు మా వేంకటరావుపై నీకుఁగలకక్ష నాపై నొక్కసారి యుపయోగించి, యే విషప్రయోగము చేతనైన నన్నొక్కసారిగా జంపివేసిన నీకెంతయైన పుణ్యముండును. అయ్యో ఈదీనుని మొర యెవ రాలింతురు. ఓ యేకపత్నీవ్రతులారా! ఓ బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠులారా! మీకు వందనములు. తుచ్ఛమగు గృహభారమును రెండవభార్యచే నడిపింపఁజూచుట మహానీచమని యెఱుగక యీ మహానరకమునఁబడి ద్వితీయభార్యయను రజ్జువుచే కట్టుబడి మహాదుఃఖము ననుభవించు నానిర్భాగ్యునిఁ గాంచి ఇట్టితుచ్ఛకార్యములఁజేయరాదని సిద్ధాంతీకరించుకొన్న యో మహాసజ్జనస్వరూపులారా! మీకు శతవందనములు. భరింపజాల. ఈశిరోభారమును భరింపజాల, ఓశిరోభారమా నన్నిట్టి కొలఁదిబాధచే బాధింపకున్న నొక్కసారిగా జంపివేయరాదా. (రెండుచేతులచేతను శిరమును గట్టిగాపట్టుకొని బాధనభినయించుచు పండుకొనును) (నాగమణి పాలగ్లాసుతో ప్రవేశించి)

నాగమ— ఏమండోయ్ నిద్రబోవుచున్నారా, లెండు భోజనమునకు, ఏమి మాట్లాడవు. ఈపాలనైన త్రాగి పండుకొనుఁడు.

చౌదరి— (లేచి) అబ్బా నాకుభోజనము వలదు పాలునువలదు. నీవు వెళ్ళి పండుకొనుము నాకు తలనొప్పిగానున్నది.

నాగ— తలనొప్పిగానున్న పాలుబుచ్చుకొనుట కేమి కొంచెము బుచ్చుకొనుఁడు లేకున్న మఱింత బాధజేయును. (అని వణుకుచు గిన్నెనిచ్చును)

చౌదరి— (పాలుత్రాగి పండుకొనును. భయమునచే కంగారుగా తిరుగుచు నాగమణి లోనికేగును మంచముపై దొర్లుచు లేచికూర్చుండి)

ఏమిది శరీరము మొద్దుబారుచున్నది, నాలుక పిడచగట్టుకొని పోవుచున్నది, కారణమేమైయుండును అయ్యో యేమిది. కన్నులుదిరుగుచున్నవి, భూమిదిరుగుచున్నది. నాశరీరములోనికి యేదోయొక విషము ప్రవేశించియుండును. సందేహమేల, ప్రవేశించినది. ఇది యెట్లు ప్రవేశించియుండును భగవంతుడు నాదుఃఖపారవశ్యము నంగీకరించి నన్ను నశియింప యిట్లుజేసియుండునా? దయాసముద్రుడగు దైవమట్లెన్నడుజేయడు, మరెవ్వరిట్లుజేసియుండును? అబ్బా దాహము. దాహము. నాగమణీ దాహము. ఏమి పల్కాడదు. [బిగ్గరగా) నాగమణీ దాహము [చాటున నాగమణి భయముచే వణకుచు నిలువబడినుండును] ఏమిరాదు ఓహో తెలిసినది. ఇదియంతయు ఈనాగమణి, కాదుకాదు ఈనాగుబాము నెడలగ్రక్కిన విషమే నన్నిట్లు నశింపజేయుచున్నది. అందులకేనా భోజనము మానినను, పాలనైన త్రాగమని బలిమిలాడిన కారణము. అబ్బా తాపము తాపము. [మంచముపైబడి కొట్టుకొనుచు] ఓ నాగమణీ ఎంత ఘోరకృత్యముజేయ బాల్పడితివి. సకలవిధముల శోభాయమానమగు గులాబీపుష్పగుచ్ఛములో నాగుబాముచేరినట్లు నీవునాయింటజేరితివి, నన్నన్నివిధముల కృశింపజేసితివి నన్నధమునిజేసి నా కనులయెదుటనే నాకొమరుడగు నీతిమార్గానుచరుడగు వేంకటరావును దేశభ్రిమ్మరునిగా జేసితివి నాయెదుటనే గురువులను నెపమున దుర్మార్గపురుషుల పాదసేవ జేసితివి. నాగృహమునసేచెడిపెల నందరపోగుజేసి భజనలను నెపమున నన్నుభ్రష్టుని జేసితివి. అదియుజాలక నాప్రాణములు, అబ్బా దాహము. దాహము హా వెంకటరావూ. నిన్ను దేశభ్రష్టుని జేసిన పాప ఫలమును ఈనాగమణి చేత ననుభవింపుచున్నాను. హా పుత్రా వేంకటేశ్వరా [ప్రాణము విడచును.]

నాగమణి—(భీతిచే మరింత వణకుచు చౌదరి దరి చేరి) ఆ,ఆ,ప్రాణము పోయినదా. అయ్యోనేనెంత దారుణమునకు సిద్ధపడితిని. అదేమి, యిదినాగృహమేనా. ఆయిన ఈభూతము లేమి. ఇదినాగృహ

ముగాదు భూతగృహము. భూతగృహము (కళ్ళు తేలవైచి నలువైపు లజూచుచు) అయ్యో ప్రపంచమంతయు గాఢాంధకారము నలము కొనినది. హాదైవమా. నాధా. ఆచెడు లక్ష్మమ్మ మాటలు నమ్మి యెంత ఘోరకృత్యముప కొడిగట్టితిని. పవిత్రమగు నీగృహముచే రి, అపవిత్రము జేసితిని. ఇప్పుడు నేనేమి చెయువలయును. అదిగో కలకలము వినపచ్చుచున్నది వారెవరో వచ్చుచున్నారు. మోసము బయలుబడకమానదు. నేనిచ్చట నిలువలేను, మరెచ్చటికేగుదును. సర్వనాశని యగు లక్ష్మమ్మ యింటికే వెళ్ళెదను. [రెండడుగులువైచి] ఇదేమి నాకన్నులు గనిపించుట లేదు నాపాదములకేమో చుట్టుకొనుచున్నది. హానాధా! హానాధా! (యని చౌదరిశవముపై బడియేడ్చుచుండ (అనసిక జారును).

---

## తృతీయరంగము.

---

### —§ యోగియాశ్రమము §—

(యోగి వేంకటరావు మాట్లాడుచుందురు.)

వేంకటరావు — స్వామీ! ఈయోగాసన ప్రాణాయామాదులపైనాకొక్క సందేహముకలుగుచున్నది.

సీ॥ పదివేలవర్షముల్ ♦ పరమాత్మమెప్పింప
గాలినాహారంబు ♦ గాగదినుచు
తపముచే దేవుని ♦ దర్శియింపజేసిన
రావణకుంభక ♦ ర్ణాదులైన
రాక్షసయోధులు ♦ రాజసంబును బెంచి
చావనివరముల ♦ జాలబొంది

జ్ఞానమించుకలేక ♦ జ్ఞాతివిరోధంబు
కలదనునెపమున కడుబూని
గీ॥ లోకసులబాధలను బెట్టి ♦ భీకరముగ
ననెడ మాటనువిన్న నీ ♦ యాసనములు
సాత్వికాహారములు నన్ను ♦ జ్ఞానవినయ
వంతునుగా జేయుననుచో ♦ వింతదోచె.

యోగి— అబ్బాయీ! సాత్వికాహారముల చేతనే సాత్విక గుణములు గలిగినచో. ఫలాదులుతిను కోతులేల సాత్విక గుణములతోనుండవు. నీవు నాడువైచిన ప్రశ్నకును, భోజనమువిసర్జించి గాలిభక్షించుచు తపముజేసిన రాక్షసులేల సుజ్ఞానులుగా లేకపోయిరని నేడువైచిన ప్రశ్నకును సరియైన జబాబునీయు కష్టము మొత్తమ్మిపై నెట్టి యాహారతపస్సుల నియమములతో జేసినప్పటికిని జ్ఞానములేకపోయిన లాభములేదు. తపస్సుచేత జ్ఞానము కలుగకపోయినను ఉన్నజ్ఞానమును వృద్ధిజేసి స్థిరరూపముజేయగలదు.

వేంకట— స్వామీ జ్ఞానముజిజ్ఞాసచే గలుగుననియు జ్ఞానముచేతనే నిశ్చలమైన భక్తిగలిగి పరమాత్మను స్మరించి తరింపవచ్చుననియు స్మృతులువాకొనుచుండ, నింక నీయాసన ప్రాణాయామాదులేలనో తెలియకున్నది.

యోగి— అబ్బాయీ, తత్కాలపరక్తిచే కలిగిన జ్ఞానముచే భగవంతుని భక్తిగా స్మరించుచుండినను కొంతకాలమునకైన మనస్సు చలింపవచ్చును ఈ యోగాభ్యాసమే యలవడినచో "యోగశ్చిత్తవృత్తినిరోధకః" అను ప్రమాణానుసారముగా మనస్సునకు నిశ్చలత్వమలవడ జేయును. (కొంచమాగి) అదియునుగాక భగవంతుని చేరుటకు అనేకమార్గములు గలవు. అందు ప్రధానమైనవి, జ్ఞానము, యోగము, అని రెండు, అందు నీవుమాట్లాడునది జ్ఞానమును గురించియును, నేను జెప్పునది యోగమునుగురించియును, మనకు యభిప్రాయములు భేదించినను చివరకు లక్ష్యమొక్కటియేసుమీ, (కొంచమాగి) ఈతర్కమింతటితో విరమించి అభ్యాసముజేసు

కొనుము. నేనుపోయి ప్రాణాయామము జేసుకొందును. (యోగి లోనికిబోవును)

వేంకట— (పద్మాసనముపై ధ్యానపరుడై) మీరు చెప్పినది యెంత వరకు నమ్మవచ్చును భగవంతుని జేరుటకు జ్ఞానము, యోగము అని రెండు మార్గములా? అయినచో జ్ఞానములేకున్నను యోగా భ్యాసములచేతనే మోక్షము నొందవచ్చునన్నమాట? యిదియే మియు నమ్మవీలులేదు. భక్తిలేకపోవుటచే రావణుడు కోటివేల శివుల నభిషేకింపుచుండినను, రామునిచే ఖండనమునకూలినట్లును మరియు జ్ఞానశూన్యతచే యనేకులతపస్సులు వ్యర్థములైనట్లును, శాస్త్రములు జాటుచుండ, భక్తివేరు. యోగము వేరు. అనుట కేవలము మోసము మాయాసాంఖ్యగురువులు నీవెట్లు నడచు చుండినను! నన్ను నమ్మినా చేవరిపూర్ణముఁనొందిన మోక్షమువచ్చు నన్నట్లు, నీకెట్టిభక్తి లేకపోయినను ఆసనములతోను, పాలు భోజ నములతోను మోక్షమువచ్చునని ఈ యాశ్రమగురువులు జెప్పు చుండిరిదప్ప, నిజమునకు నెట్టివారికిని ప్రధానమైనది భక్తియే అందుచేతనే యెట్టిముభ్యాసకులైనను, యెట్టితపస్సంపన్నులుగాని, చివరకు భగవంతుని నిశ్చల భక్తితో ధ్యానించి ముక్తిబడసినట్లు కానబడుచున్నది. నిశ్చలమైన భక్తి గలవారలకే యోగముల తోను, మంత్రధ్యానములతోను, స్నాన సంధ్యలతోను, పనిలేదని నీన్న, నిజమైన భక్తుడు.

సీ॥ దనుజారి లీలావ ♦ తారంబు లందలి
శౌర్య కర్మంబులు ♦ సద్గుణములు
వినిభక్తుడగువాడు ♦ వేడ్కలో పులకించి
కన్నుల హర్షాశ్రు ♦ కణములొలుక
గద్గద స్వరముతో ♦ కమలాక్ష వైకుంఠ
వరద నారాయణ ♦ వాసుదేవ
యనుచు నొత్తిలిపాడు ♦ నాడు నాక్రోశించు
నగు జింతనముజేయు ♦ నతియొనర్చు

గీ॥ మరలుకొనియుండు దనలోన • మాటలాడు
వేల్పుసోకిన పురుషుని • వృత్తి దిరుగు.
బంధములబాసి యజ్ఞాన • పటలిగాల్చి
విష్ణు భావించు తుదిభక్తి • వివసుడగుచు

అనిగదా భాగవత ప్రమాణము అట్టి భక్తునకు ఈయోగము పైగాని మంత్రధ్యానములపైగాని, కుటుంబముపైగాని చివరకు కాలముపైగాని, జ్ఞప్తి యుండునను కల్ల, భ్రాంతిలేక పోయినను గృహ నటనజేయుచు, లోపల భక్తితో నుంటిమను గురువులు, కుచ్ఛితులు, కూళలు, మోసగాండ్రు. యేలనా? సర్వము విష్ణుమయముగా జూచుచు, లోకనటన జేయుచుంటిమను, ఈకలికాల గురువులే వారిమాటలకు కించిత్ యెదురు జెప్పిన వారిపై ఆమండిపడుట యెందులకు, ఇదియు ప్రపంచనటనయేనా? ఛీ, ఛీ, ఈ దొంగ దేశికులమాట తలపెట్టిన యొడలు మండుచున్నది. ఓరోరి మాయదేశికులారా సర్వము విసర్జించిన జడభరతుడంత మహర్షి లేడిపై ప్రేమచే ఆజన్మననుభవించెనని పురాణములు వ్రాయు చుండ వస్తువుల ననుభవించుచు ప్రేమలేక విమ్మరి పురుషుల వలె నుందుమనదిమీరా! పోనిమ్ము ఈ కలికాల కల్లగురువులకథలు నాకేల, నాకర్తవ్యమును నేను నిర్ణయించుకొందునుగాక, (కొంచమాలోచించి) నానిర్ణయమేమి? నాకర్తవ్యము ఆజడభరతుడే నిర్ణయించినాడు, గాన వారివలెనే ఈ జింకచర్మకమండలముల విడనాడి, శరీరమాత్రముగా వెడలి జడాంధబధిరమూకపిశాచోన్మాదునివలె నొరులతోసాంగత్యంబుజేయక యేకాకినై సంచరింపుచు నాదేవదేవునిపై లక్ష్యముంచి

క॥ లేదని యెవ్వరినడుగక
రాదని చింతింపకొరులు • రప్పించినచో
గాదని యేదియుమానక
ఖేదముమోదమును లేక • క్రీడింతుమదిన్. (భాగవత)

ఈసాయంతనమే యీయోగినివిశనాడి బయలుదేరెదగాక (ధ్యానములోనుండును) (కోర్టు అమీనా కొన్నికాగితములతో ప్రవేశించి) అయ్యా యిచ్చట వేంకటరావుండునది యెక్కడ

వేంకట— యెందునిమిత్తము వేంకటరావు మీకుకావలయును?

కో॥అ—కోర్టునుండి వారిని సాక్షిగాబిలిపించుటకు ఒకసమనువచ్చినది

వేంకట—నేనే వేంకటరావును యేదీ ఆసమును చదువుడు.

కో॥అ—(సమనువిప్పి) శక్షన్ కోర్టునుండి, వేంకటరావుగార్కి 302 శెక్షన్ ప్రకారము, 1 నాగమణి 2 లక్ష్మమ్మ 3 గురువు 4 గంగమ్మలపై తేబడిన కూనీనేరములో ముద్దాయిలను విచారించుటకుగాను ది 12-4-30 తేదీని పగలు పదకొండుగంటలకు సాక్షిగా కోర్టునకు హాజరుకావలసినది. అట్లు హాజరుగాకపోయిన రాజతిరస్కారమునకు నీపైతగిన చర్యజరుపబడును. సంతకము

సర్. టి. వి. తిరువెంగళాచార్యులు, జిల్లాజడ్జి.

కోర్టు ముద్రవేయబడియున్నది.

వేంకటరావు—(భయముతో) అయ్యా, వారలపై కూనీనేరమేదియో అందులో నాసాక్ష్యమేమియో బోధపడుకున్నది. దయచేసి వివరములు తెలుప ప్రార్థించుచున్నాను.

కో—అ—అయ్యా! ఈసమనులో యింతకంటె వివరములులేవు కాని నాకు తెలిసినంతవరకు మాత్రము చెప్పెదను, ఈ 1, 2, 3, 4 ముద్దాయిలను పోయిననెలలో క్రిందకోర్టున విచారింపబడి శక్షనుకమెందు చేయబడిరి. అందులో పోలీసువారు మీసాక్ష్యమునువిచారింపగోరుటచే యెల్లుండి, 12 న తేదీని మీసాక్ష్యమును విచారించుటకై వాయిదా వేయబడినది.

వేంకట—అయ్యా! ఆకూనీచేయబడిన నిర్భాగ్యుడెవరు, రెండు మాసములనుండి ఈమూలాశ్రమములోనుండిన నాసాక్ష్యమేమవుసరము.

కో—అ—అదంతయు నాకు తెలియదు. ఆచంపబడినవారికి మీరు బంధువులట. అందుచేత మీసాక్ష్యము గోరబడినది. ఆ రెండు మూడు నాలుగు ముద్దాయిల ప్రోద్బలముచే మొదటిముద్దాయి అయిన నాగమణి విప్రప్రయోగముచే తనభర్తను జంపినదట.

**వేంకట**—(హా! తండ్రీయని మూర్ఛపడును.)

**కో**—అ—(బిగ్గరగా) అయ్యో యెవరిక్కడుంటునది, త్వరగా రండు ప్రమాదము, ప్రమాదము.

**యోగి**—(త్వరగా ప్రవేశించి, మొగముపై నీళ్ళు చల్లును.)

**వేంకట**—(లేచి) అయ్యో దిక్కులేని యీదీనునకీవార్త నీవు పొరబడి చెప్పలేదుగదా, అయ్యో నీవేల పొరబడుదువు (దుఃఖముతో) హా తండ్రీ చివరికెట్టి నీచపుచావు జచ్చితివి బాల్యమాదిగ నగచాట్లు బడుచున్న యీపాపినింకను భూమిపై కష్టముల ననుభవింపుమని విడనాడిపోయితివా? లేక నాసేవ చేయక దేశత్యాగియైన నిర్భాగ్య కొమారుని యేల చూడవలయునని పరలోకమున కేగితివా? అయ్యో, పినతల్లి, నన్ను పెండ్లియాడినదిమొదలు నీ చెప్పుచేతలలో నుండి కడకు నన్ను వెడలుగొట్టినప్పుడైన పల్లెత్తుమాటాడని ఆశాంతమూర్తిని విషప్రయోగముచే జంప నీచేతులెట్లాడెను, ఓ అనంతా! మమ్మింత అగచాట్లుబెట్ట ధర్మమేనా, హా తండ్రీ యెన్ని జన్మలకైన నీ యట్టివానికి పుత్రుడనగు భాగ్య మీ నిర్భాగ్యునకు గల్గునా!

సీ॥ పశితనంబునఁదల్లి ♦ పరలోకమున కేగ
కన్నతల్లిగ నన్ను ♦ గాచినావు
నామేలు నెగోరి ♦ నాకొక్కరుకై
నతివృద్ధువై పెండ్లి ♦ యాడినావు
పినతల్లి భోజనం ♦ బిడకున్న నను బిల్చి
ప్రేమ మీరఁగ బువ్వ ♦ బెట్టినావు
రాకాశియాదాని ♦ రాపిడిచె కుడు
పాపంబులన్నట్టి ♦ వరలినావు

గీ॥ అకట దాసను సుఖమింత ♦ యొనలేక
దుష్టయగు నాగమణిచేతి ♦ తుదకు నీకు
విషము చేచావు నాకును ♦ వివిధదేశ
గతియునంచును వ్రాసెనా ♦ కమలభవుడు॥

ఓ సంఘసంస్కర్తలారా! యేమి జేయుచుండిరి. ఈ నీచగురువుల యుపదేశములచే యెన్నెన్ని కాపురములు గంగగలసిపోవుచున్నవో చూచుచుండిరా? ఉపదేశముల నెపమున విచ్చలవిడిగా సంచరించు స్త్రీలకై యెందరు మానవంతులు యేమిగతి దైవమా యని యేడ్చుచున్నారో గమనించుచుండిరా! ఓ యుపదేశములందను త్సాహపడు మానవతులారా గమనించుచుండిరా యీయన్యాయము. గమనించుచుండియు మీరు యేలయిట్టి దుష్టసంఘములలో జేరబోయెదరు? తిండికై వచ్చు ఈ దుష్టదేశికులకు ధర్మముగా కొంత ధనమునైన నీయుడుగాని భగవంతుని బోలు భర్తసేవను వీడి దుష్టులగు ఆ గురుపాదములను మాత్రముపట్టుటకై జేరకుడు. ఇట్టి మోస గురుసంఘముల నెరిగియు వారి సంఘములలో చేరినచో ఈరీతిని తండ్రిని గోల్పోయి దుఃఖించు నాయుసురు మీకు తప్పక తగుల గలదు.

యోగి—వేంకటరావూ, సర్వము తెలసిననీవే యిట్లుదుఃఖించుట భావ్యముగాదు. దుఃఖశాంతినిబొంది ముందు నీకర్తవ్యము నాలోచించు కొనుము.

వేంకట—అయ్యా, ఇంక నాకర్తవ్యమేమి? నాకర్తవ్యమింతకు ముందే నిర్ణయించితిని. దానిని మరింత బలపరచుటకోయన నాతండ్రిచావు ఈసమయముననే దెలియవచ్చినది. చంచలముగు నామనస్సునకు ఈనాతండ్రి చావు విరక్తిబీజమగుగాక. ఇదిగో యిప్పుడే నానిర్ణయానుసారముగా సర్వ వస్తువులు విసర్జించి శరీర మాత్రముగా వెడలుచున్నాను, యోగీశ్వరా సమస్కారము. (దండక మండలాది పరికరములు విసర్జించి త్యాగియై వెడలి పోవుచుండ, గురువు అమేనాలు నిర్ఘాంత పోయి చూచుచుండ, అవనిక జారును)






# పంచమాంకము

## ప్రథమరంగము.

### —॥ న్యాయస్థానము. ॥—

[పీఠముపైన్యాయాధికారి. ఒకప్రక్క 1-2-3-4 ముద్దాయిలు, వారివకీలు నిరంజనరావున్నూ, రెండవప్రక్క బోనులో రంగారావు, ప్యాసిక్యూటరు, అసీసర్లు, కూర్చొనియుండగా తెరలేచును]

**నిరంజనరావు.—** [లేచి] వెంకటరావు హాజరులేదుగాన వాయిదాయిప్పించగోరుచున్నాను.

**న్యాయాధికారి—** నో, నో, విచారణజరుగును. (జవానుతో) ప్రమాణము జేయించుము.

**జవాను—** [రంగారావుచేత సువర్ణముంచి] నేను దేవునియెదుటవలెనే ఈ యధిపతులయెదుట సత్యముజెప్పెదను. అసత్యముజెప్పను

**న్యాయా—** నిన్నటికేరునాయి జెప్పుము.

**రం—** అయ్యా, లక్ష్మమ్మ నాగమణిచే వెంకటరావు వెడలగొట్టించిన వెనుక, చాదరిని చంపించుటకు యత్నమై నాతో హెచ్చరించినది కాని, నేను అందులకంగీకరించలేను. మరల లక్ష్మమ్మ 5-6 దినములలో నన్ను బిలిపించి గురువుసన్నిధినుండి లేఖవచ్చినదని ఈ లేఖనాకుజూపినది. [అని లేఖనిచ్చును.]

**ప్యాసిక్యూటరు—** [లేఖజదువుచు] ఆత్మబిడ్డయగు లక్ష్మమ్మగారికి మీాలేఖయందినది. సంతోషించితిని నేనువచునాల్గవతారీఖున గం

గన్నమ్మ చేతికి విషమందునిచ్చి పంపించెద. ఆవిషము నుపయోగించిన మెట్టివాఁడైనను పదినిముషములలో పరలోకమున కేగును. మిగిలిన విషయములు నేనువచ్చి మాట్లాడెదను. గురువు చేవ్రాలున్నది.

[చదివి బల్లపైనుంచును]

న్యాయ—తరువాత.

రంగా—ఆదినముననే గంగన్నవచ్చి లక్ష్మమ్మ చేతికి ఆమందు యిచ్చినది. ఆరాత్రి నేను లక్ష్మమ్మ యింటివద్దనే పండుకొంటిని లక్ష్మమ్మ నాగమణిని బిలిపించి ఆమందునిచ్చి యుపయోగించు ప్రకారముచెప్పి పంపినది ఆరాత్రి 12 గంటలవేళ నాగమణి తోటపాటుతో లక్ష్మమ్మగారి యింటికివచ్చి యేడువ ప్రారంభించినది. లక్ష్మమ్మయు కారణము దెలుసుకొని నాగమణిని యోదార్చి వారింటికే దీసుకొనిపోయినది. కొంచెమాలస్యముగా నేనుగూడ నాగమణియింటికేగితిని. అప్పటికే అనేకులు గుమిగూడియుండిరి. ఇంతలో కొందరు శవము తీసుకొనిపోవ యత్నింపుచుండ శవమును గ్రామమునసబుగారిచే నాట కబురుపబడి షుమారు ఒకగంట కాలమునను రక్షకభటులచే పరీక్షచేయబడెను.

న్యాయ—గురువులవద్ద నుపదేశమునొందితివిగదా. నుపదేశములననేమి?

రంగా—ఉపదేశమన మోక్షమునుపొందు మార్గము.

న్యాయ—గురువులకు నింత ప్రభావముండ శిష్యులకై వీరేల తిరుగవలయును?

రంగా—శిష్యులైనవారు సంవత్సరమున కింతయని ధనమునిచ్చుచుందురు. అందుచేత జ్ఞానబోధ జేయుటకను నెపమున గ్రామముల వెంట శిష్యుల జేరిపించుటకై వారే యత్నింపుచుందురు.

న్యాయ—(నవ్వి) అదియా సమయము. (ప్లీడరువైపుచూచును)

నిరంజన—(లేచి) ధనసంపాదనకై గురువులు గ్రామములవెంట తిరుగుదురంటివిగదా, వారు మోసగాండ్రని తెలిసియు నీవేల యువ

దేశమునుబొంది, యితరులను ఉపదేశములనొందవలసినదని ప్రో త్సాహమిచ్చుచుంటివి.

రంగా—శిష్యుల జేర్పించిన శిష్యునికెంతయుని మారు కవిూషనిచ్చె దరు.

నిరంజ—అదియూసంగతి, సరియే గంగమ్మ లక్ష్మమ్మ చేతికి మందు యిచ్చినది నీవు గాంచితివా.

రంగా— చూచితిని.

నిరంజ—నీవేల పోలీసువారికి రిపోర్టుచేయ లేదు.

రంగా—లక్ష్మమ్మ బలవంతము చేత.

నిరంజ—(అపహాస్యముగా) అలాగునా. సరే నీవు వెళ్ళవచ్చును. (కూర్చుండును)

ప్రాసిక్యూటరు—బలరామయ్యను పిలువుము.

జవాను— (బలరామయ్యను ముమ్మారుపిలువగా వచ్చును. ప్రమాణము జేయించును.)

న్యాయా—ఈ కేసులో నీకెంతవరకు దెలియునో యదార్థము జె ప్పుము.

బలరా—అయ్యా, లక్ష్మమ్మ యింటివెనుకనే నాయిల్లున్నది, 14వ తేదీరాత్రి 12 గంటలకు లక్ష్మమ్మయింటిలో యేడ్పు వినబడ గా నేను బయటకువెళ్ళి యెవరా యేడ్చునది యని అడిగితిని. అ ప్పుడు ఈ రంగారావు ఆ యింటిలోనుండి బయటకువచ్చి యేమి యు లేదు లక్ష్మమ్మకు తేలుగుట్టగా యేడ్చుచున్నదని చెప్పెను. తిరిగినేను పశువులజూచుకొని లోనికేగి పండుకొనబోవునంతలో నాగమణియింటివద్ద పెద్దగా యేడ్పులు వినవచ్చినవి. అంత నేను బయలుదేరి అచటకిబోయితిని. అప్పటి కేశవమును మునసబ్ గారిచే ఆటంకపరుపబడుచున్నది. లక్ష్మమ్మమాతృము చౌదరిప్రాణము కప్పనాకుడుచేతనే పోయినదని ప్రజలకు జెప్పుచుండెను. ఆమెకు తేలుబాధ యున్నటులమాత్రము నాకు కనబడ లేదు.

న్యాయా—నిరంజనరావుగారు! ఇక మీరు క్రాస్ చేయవచ్చును.

నిరంజన—(నిలచి) నీవు లక్ష్మమ్మను ఆతేలుబాధ విషయమై ప్రశ్నించితివా?

బల—ఆజనసమూహములో ఆవిషయము ప్రశ్నించుటకు వీలులేక పోయినది.

నిరంజ—పోనీ తేలుబాధ కొన్ని నిముషములలో పోగొట్టువారు గలరనియైన నీకుదెలియునా?

బల—కొందరు నివారణ జేయగలుగుదురట.

నిరం—సరియే నీవుపొమ్ము (కూర్చుండును)

న్యాయా—నాగమణీ! యీకేసులో నీవేమి చెప్పకొనెదవు?

నాగమణి—(తనలో) ఇప్పుడు నేనేమని జెప్పవలసియున్నది. ఇదియంతయు, యదార్థమని తెలియజేసి పాపఫల మనుభవించుటయా? లేక అసత్య ప్రలాపములచే అసలు విషయమే తెలియదనుటయా? మాణిక్యమువంటి మాపాటి కొమరుని దేశభ్రష్టునిజేసి భగవంతునిబోలు భర్తనుజంపి పండువంటి కాపురము పాడుజేసి, ఇంకను బ్రతికిమాత్రమేమి ప్రయోజనము. కాని లక్ష్మమ్మతో శబధము జేసిన ప్రకారము నేనెరుగనని చెప్పటకంటె గత్యంతరము లేదు. (ప్రకాశము) అయ్యా! నేనిరపరాధిని.

న్యాయ—లక్ష్మమ్మా! నీవేమిచెప్పకొనెదవు?

లక్ష్మ—అయ్యా! రంగారావునకు నాపైనున్న ఈర్ష్యచే చెప్పిన వాక్యములేదప్ప నేనిరపరాధిని.

న్యాయ—గురువూ నీవేమి చెప్పకొనెదవు?

గురువు—(తనలో) నేనేమని యిప్పుడు సమాధానమిత్తును?

సీ॥ అగ్నిసాక్షిగ పెండ్లియాడిన సతివీడి
పరసతి గూడిన • పాపఫలము
భర్తల విడదీసి • భార్యల రప్పించి
పాదపూజలుగొన్న • పాపఫలము
గురుకట్నము లటంచు • గురుపూజలని రూక
లపరిమితముగదిన్న • పాపఫలము

ధనమున కాశించి ♦ ధర్మాత్మ చోదరి
ప్రాణంబులనుగొన్న ♦ పాపఫలము
గీ॥ యేకరూపంబుదాల్చి యీ ♦ యెదురనున్న
జడ్జిరూపంబెలయి నన్ను ♦ జరిగినట్టి
పాపకృత్యమున కేమి ♦ జవాబటంచు
అడుగుచున్నది గాబోలు ♦ ఔర నేడ.
ఇంకను జవాబేల యివ్వవలయును?
గీ॥ పరుల కపకారములజేయు ♦ పాపమంతు
వీసమైనను విడువక ♦ విశ్వనాయకుడు
శిక్షణము జేయునంచును ♦ స్మృతులు పలుక
కట్టి కుడుపక విడచునా ♦ కర్మఫలము.
గాన యిప్పుడు నాకు మానమే శరణ్యము. (ప్రకాశముగ)
అయ్యా! నేనునిరపరాధిని.
న్యాయ—గంగమ్మా నీవేమి చెప్పుకొనెదవు.
గంగ—(తనలో)
గీ॥ భర్తచచ్చిన మరునాడె ♦ బంధుమిత్ర
పరువు మర్యాదలను రోసి ♦ పాపమనక
గురువుతోడను ఆనాడు ♦ కూడియాడి
తప్పుకొని పోవయినాడు ♦ తరమెనాకు
కాననేనును యెరుగనని దెలుపుటయే మంచిది. (ప్రకాశముగ)
అయ్యా నే నిరపరాధిని.
న్యాయా—నిరంజనరావుగారు! మీరు ఆర్గుచేయవచ్చును.
నిరం—(లేచి) ఈ కేసులో సాక్ష్యముచెప్పిన రంగారావుగారికిన్ని గురువులకున్నూ గురుశిష్యసంపర్కము గలదని యెక్కడను ఋజువుగా లేదు. ఈగురువు శిష్యుల జేర్పించుకొనుటయు, ఉపదేశములిచ్చుటయు, హిందూ శాస్త్రధర్మప్రకారము తప్పులేదు. భారత దేశమున పూర్వకాలమునుండియు, ఇట్టియాచారములు జరుగుచునేయున్నవి. ఇక శిష్యులు గురుకట్నముల సమర్పించుటయు ధర్మమే, కాని

ఉపదేశములిచ్చుట! నీచవృత్తిమాత్రము యెన్నడు కానేరదు. ఇకగురువు, చాకరిని జంపు కుట్టలో గలసిమందుపంపించెననియు గంగమ్మ, తెచ్చియిచ్చెననియు లక్ష్మమ్మ, నాగమణిచే ప్రయోగము చేయించెననియు, తెలిపిన సాక్ష్యమునకు బలమైన కారణముగాన రాదు. అందుగంగమ్మ ఈ గ్రామము వచ్చినట్లుగాని, లక్ష్మమ్మనాగమణి చేతికి మందుఇచ్చినట్లుగాని, రంగారావుదప్ప వేరుచూచిన సాక్ష్యము లేదు. కాబట్టి ఒక్కసాక్ష్యముపై నాధారపడి ఈకేసురుజువుచేయరాదు. ఇకలక్ష్మమ్మ తేలుబాధచే యేడ్చుచుండెననియు, అప్పటికప్పుడే నాగమణి యింటివద్ద కనబడెననియు, తెలిపినకారణమొక కారణముగాదు. యేలయన తేలుకాటువెంటనేనివారణజేయువారు గలరని ఆసాక్షియే చెప్పియున్నాడు. ఇగనాగమణి స్వతంత్రమునకై తనభర్తను చంపెననుటయుగూడ నసత్యమే. కారణమేమన, అంతకుపూర్వముడినము ఆయింట ఈమెయే స్వతంత్రురాలని వారిసాక్ష్యమునుబట్టియే తేలినది. యెన్నివిధముల విమర్శించినను సర్వస్వాతంత్రము గల ఈ నాగమణి స్వతంత్రముకొరకై భర్తకు విషముబెట్టెననుమాట నమ్మ వీలులేదు. ఇదియంతయు రంగారావు మరికొందర సాక్ష్యములతో పోలీసువారు కల్పనచేసిన గాలితప్ప నిజముగాదు. కాబట్టి అధిపతులు న్యాయమును గలుగజేసి ముద్దాయిలను విడుదల జేయగలందులకు కోర్టువారి ఘనతనుకోని యోచుచున్నాను. (కూర్చుండును)

ప్రాసిక్యూటర్—(లేచి) ఈకేసులో 3వ ముద్దాయియైన గురువునకున్నూ రంగారావుకున్నూ గురుశిష్యసంపర్కము గలదని, రంగారావు శిష్యులనుండి గురు వార్షిక కట్నముల వసూలుజేసి డబ్బు పంపుటయున్నూ, శిష్యుల జేర్పించుటకై జరిగిన ప్రత్యుత్తర ప్రత్యుత్తరములును ఋజువుచేయుచున్నవి. గంగమ్మచే మందుపంపించెదను. అని గురువు వ్రాసిన యుత్తరమునుబట్టి గురువు గంగమ్మల యపరాధము ఋజువగుచున్నది. ఆమందు లక్ష్మమ్మద్వారా బంపించుటచే ఆమెయు ఈకుట్టలో జేరినదని పూర్ణముగా ఋజు వగుచున్న

ది. ఇక ఈ నాగమణి వేంకట్రావును వెడలగొట్టుటయు చౌదరిభో జనపానాదులు చూడక పోవుటయు గురుప్రాణలకుంచి ప్రతిదిన ము వారికి జరుగుచున్న ప్రతివాదములబట్టియు చౌదరి విషప్రయో గముచేతనే చచ్చెనను డాక్టరు వాఙ్మూలమునుబట్టియు, ఈ నాగ మణి సర్వాధికారిణి యగుటకై చౌదరిని విషప్రయోగముచే చంపె ననుటకు యేమియు సందేహము లేదు. గాన అధిపతులు న్యాయ మును గలుగజేసి ముద్దాయిలకు దగినశిక్షలు విధించగలందులకు శ్రీవారి ఘనతనుగోరి వేడుచున్నాను. [కూర్చుండును]

న్యాయాధిపతి—[అసెసర్లవైపు తిరిగి] మీరు ఈ కేసుయొక్క వాద ప్రతివాదములను పూర్తిగా వింటిరిగదా? మీయభిప్రాయము లేమి.

1 అసీసరు—(లేచి) గురువు లక్ష్మమ్మల ప్రోద్బలముచే నాగమణి చౌదరిని చంపినట్లున్నూ గంగమ్మ ఆమందు తెచ్చి యిచ్చినట్లున్నూ నేను నమ్ముచున్నాను. [అయిదుగురు నట్లేయందురు.]

న్యాయా—[కొంతవరకేదియో వ్రాసుకొని] ఈ కేసులో 1వ ముద్దాయియైన నాగమణికి ద్వీపాంతరవాస శిక్షయు, రెండవ ముద్దయియైన లక్ష్మమ్మకు మూడు సంవత్సరములు విడి కైదును, మూడవ ముద్దాయియైన గురువునకు నాలుగు సంవత్సరములు కఠిన శిక్షయును, నాల్గవ ముద్దాయియైన గంగమ్మకు తొమ్మిది మాసములు విడి కైదును ఐదువందల జుర్మానాయు విధించుచున్నాను. జరిమానా చెల్లించని పక్షమున తొమ్మిది వారములు కఠినశిక్షయును విధింపుచున్నాను. (అని చెప్పి లేచి పోవును)

(ముద్దాయిలు దుఃఖింపుచుండ నాగమణిమూర్ఛపడి లేచి)

నాగ—అన్యాయము అన్యాయము. న్యాయాధిపతీ! అన్యాయము నేను చంపలేదు చంపలేదు. ఎవరు ఆలించువారు. (కళ్ళుమూసుకొని) నాథా! నాథా! నిన్ను నేనే చంపితిని. యదార్థముగ నేనే, (కళ్ళు తెరచి) లక్ష్మమ్మా నేను వినను, వినను, నిజము జెప్పెదను, ముమ్మాటికి జెప్పెదను (దుఃఖముతో) వలదా, చెప్పవలదా, సత్య మును జెప్పి పాపఫలమనుభవింపనీయవా, వారెవరు, వీరా, వర

కవాసులా రండు. మొత్తుడు, నాభర్తను చంపిన కఠినాత్మురాలను నేనే, లక్ష్మమ్మా మోక్షమేది, పరిపూర్ణమేది. మోసము. మోసము. యమకింకరులా రారండు. రండు. చంపుడు, లక్ష్మమ్మా యమకూపమున కంపుచుంటివా, పోవుచున్నాను (ఆశ్చర్యముతో) అదేమి మావేంకటరావేనా? భగవానుడు, అయ్యో దీవింపుచున్నావా, భయపడవలదనుచున్నావా, వలదు, వలదు. మహాపాపిని, నన్నంటకుము, నన్నంటకుము. (మూర్ఛపోవును)

---

ద్వితీయరంగము.

---

—§ జయదేవునిల్లు. §—

(తులసీ జయదేవులు లక్ష్మీపూజజేయుచుండ బాలకుడాడుకొనుచుండును. తెరలేచును.)

జయదేవుడు—[పూజముగించి] బయటకువచ్చి యేమి యింతవరకు రాలేదు. [దిక్కులజూచును, నరిసిగాడు ప్రవేశించును] యేమిరా చేని కెందరపనివాండ్రను పంపించితివి.

నరసడు—బాబూ! ఇరువదిమందిచాలునని పంపించితిని. కాని రంగయ్యగారు గట్టువేయనీయుటలేదు.

జయ—ఏమి, ఈసంవత్సరముకూడ అడ్డువచ్చినాడా? కానిమ్ము వాని పనిగనుగొందము. నీవుభోజనముజేసి మనవారితో కలసివెళ్ళి గట్టువేయుడు కాని కలహమునకుముందు సాధ్యమైనంతవరకు సంధికి యత్నించి అటుమీాద గట్టువేయుడు. నీవులోనికేగి ఆపెరడులో భోజనముజేయుము. [నరసడులోనికేగును] ఈరంగయ్య సాత్వికముచేత వినువాడు మాత్రముకాడు. అతనికడ ఈశాంతభావములు పనికిరావు. ఇనుమును ఇనుముచేతనే ఖండింపవలయును. కాన

వానిని యెరుఁగుటయే కర్తవ్యము. [బాలుఁడు ప్రవేశించు
ను] అబ్బాయీ యింకనున్నావు. ఈదినము బడికిపోలేదేమి?

బాలుఁడు—నాన్నా, మరేమో పంతులుగారు, పూజచేసుకుంటారంత, అందు
కని ఈనాఁడు బడిలేదు. రేపురండి అన్నారు.

జయ—అవునవును, మరచితిని, నేఁడు యేకాదశికదా.

బాలు—నాన్నా, నేనే, ఆబజారుల కెళ్లి ఆడుకుంటా

జయ—వెళ్లకూడదు తప్పు, ఇచ్చటనే కూర్చుండుము. [బాలుఁడు
కూర్చుండును.] బాబూ! యేదీ మీపంతులుగారుజెప్పిన ఆటవిడుపు
పద్యములలో ఒకపద్యము చదువుము.

బాలుఁడు—

ఆ॥ వె॥ తల్లిదండ్రులమీఁద • దయలేనిపుత్రుండు
పుట్టనేమి వాఁడు • గిట్టనేమి
పుట్టలోని చెదలు • పుట్టదా గిట్టదా
విశ్వదాభిరామ • వినుర వేమ॥

జయ—బాగున్నది. ఇంక బాగుగాఁ జదువుము. (తెరలో) బాబూ
రక్షించండి) యెవరువారు (లేచి బజారులోనికేఁగి క్షణమాగి యొ
కభిక్షకునితో ప్రవేశించును)

భిక్షకుడు—బాబూ నేనేమీ అనలేదండి. చిన్నటినుండి ఒక్కముద్ద
యైన దొరకకపోవుటచే ఆకలిదప్పుచేత వారు వెళ్లిపొమ్మన్నను
పోక యిల్లుముద్ద అడుగుతున్నానండి. అంతేనండి బాబూ నత్తెప్ప
మాణంగా అంతే, వారికే తగాదు కోపంబడీ కఱ్ఱతో కొట్తున్నా
డండీ రక్షించాలండి బాబు (అని మొఱ్ఱపెట్టును)

జయ—(కరుణతో) శ్రీరామచంద్ర ఇంతమాత్రమునకే భిక్షుని ఇ
ట్లు కొట్టఁగలరా. అందులో పూజలని, యాత్రలని, ని
యమములని, ఉపదేశములనియు, చేయు ఈచంద్రశేఖరమే ఇట్లు
బీదల దండించుటయా? క్షుద్బాధచే మాడిచచ్చువారికి పిడికెడన్న
మిడలేక దండించువారలకీ నియమములేల నిష్ఠలేల. (అసహ్యము
తో) వెధవలు. సత్యము అహింస బ్రహ్మచర్యముల పాలించలేక

ఇట్టి చదువనుల జేయుటయు పైకిమాత్రము మేము గురుబిడ్డలము పరిపూర్ణులమని తిరుగుటయు నెందులకిదాంబికభక్తి ఈతుచ్ఛులు పర్జలను మోసపుచ్చినను పరమాత్మను మోసపుచ్చగలరా.

తులసి— (లోపలినుండివచ్చి) యేమండీ. మీరు పరధ్యాన్నములోపడి ప్రకృతిని మరచినట్లున్నది. పసమా అతిథికి యెంతెత్తుదాభధగనున్నదో త్వరగా భోజనమున కాజ్ఞయిండు.

జయ— ఆజ్ఞయేమి? వెంటనే భోజనముపెట్టుము.

తులసి— (భిక్షుకునితో) నాయనా ఆప్రక్క దారిని పెరటిలోనికిరమ్మా. అచ్చట భోజనముచేయవచ్చును. (భిక్షుకుడు ఆనందమున నమస్కరించి ప్రక్క తెరలోనికేగును.)

నరసడు— (భోజనముచేసి ప్రవేశించుచును)

జయదేవుడు— నరసా, నీవుత్వరగావెళ్ళి ఈదినమేబాగుచేయింపుము. రేపు తప్పకనాటువేయవలెను. (ఇంతలో యిరువురు యాచకులు ప్రవేశము)

1 యాచకుడు— (జయదేవునిగాంచి) అయ్యా మీరేనా జయదేవులు.

జయ— అవును.

2 యాచ—

సీ॥ కెలకులనున్నతం • గెటిజున్ను గృహమేధి
యజమానుడంకస్థి • తార్ధపేటి
పండిన పెరటిక • ల్పకమువాస్తవ్యంబు
దొడ్డిపెట్టినపల్ప • గిడ్డిగపు
కడలేని యమృతంబు • నడబావి నంసారి
సవిధమేరునగంబు • భవనభర్త
మరుదేశపథమధ్య • మ్ప్రపకులపతి
యాకటికో ప్రవున • స్యముకుటుంబి

గీ॥ బధిరపంగ్వంధభిక్షుక • బ్రహ్మచారి
జటిపరివ్రాజికాతిథి • క్షపణాక వ

ధూతకాపాలికాద్యనా ♦ ధులకుగాన
భూసురోత్తమగార్హ్యాస్థ్య ♦ మునకుసరిరా॥

1 యాచ—
కం॥ అనఘుడు జయదేవుడటం
చును జనులెల్లమెచ్చ ♦ జూచితిమిచటన్
ఘనమైన శుభములొదవెను
మనదారిద్ర్యంబుపోయి ♦ భాగ్యముకల్గెన్॥

2 యాచ—తప్పు తప్పు.
కం॥ దరిశనమున శుభమని నీ
వరచితివదియేలపేరె ♦ యాలించినచో
శిరిగలుగు మరియుతమ్ముడ
దరిశనమున ముక్తిమనకు ♦ తప్పక కలుగున్.

జయదేవు—అయ్యా మీరెటనుండి యెందులకై యిటకు వచ్చితిరి.

1 యాచ—స్వామీ మేము యాచకులము. ఈగ్రామము మొన్ననే వచ్చితిమి. మీవంటి పెద్దలదర్శించి మాపాండిత్యము వెల్లడించి తమవంటివారిచే ఆశీర్వాదములుబొంది నాలుగైదు దినములలో వెళ్ళెదము

జయదే—ఓహో మీరా? రాత్రిసత్రమునందు గంజాయి త్రావుచు చుట్టునుజేరినవారికి అది పరమోత్కృష్టమైనదనియు ఈ పత్రిసే వించినచో ప్రకృతి గుణములువీడి పరమాత్మని దర్శింపవ చ్చుననియు చెప్పుచుండునది మీరేగదా?

1 యా—అయ్యా! మేము పత్రిసేవించునది నిజమే గాని, యితరులకు మాత్రము నిద్రతాగమని చెప్పుచుండుటలేదు.

నర్సడు—బాబుగారూ! వీరునిన్న సాయంత్రము కలుపాకలో గూడ నున్నారండి

జయ—(అసహ్యభావముతో) ఓయీ ఇట్టిదురాచారులకును, డాంబి కులకును, ఇచ్చట తావులేదు. మరియొకచోటికి బొండు

యా.—అయ్యా! మేమువిద్వాంసులము, తమపేరు పలుదేశములజెప్పు కొనుచుందుము

జయ.—(మరింతఅసహ్యముచే) ఓయీ! నన్నుమీరు పొగడనవసర ములేదు. పేరుకీర్తులకై ప్రాకులాడు ఆహారుగింటి చంద్రశేఖరము గారివద్దకేగుడు, పొట్టమాడినవారికి పిడికెడు మెతుకులువేయకపో యినను, పొగడెదమనువారికిమాత్రము పట్టుశాలువలు గట్టబెట్టు ను, కావున మిమ్ములనూ బాగుగా తస్కరించును. పొండు ఎక్కువ ప్రశ్నించిననూ లాభములేదు. (యాచకులు వెడలిపోవును నర్స నితో) నీవాకల్లుపాకకడ కేలపోయితివి

నర్సుడు.—(భయముచే వడకుచు) బాబుగారూ! మీరు తాగ్రగూడ దని చెప్పిన దగ్గరనుండియు, మానివేశానండి. క్షమించాలి నిన్న మా అన్నకూతురు పెళ్లండి, అందుకని కులపోళ్ళు పట్టుపట్టి నన్ను గూడ తీసుకపోయారండి, రక్షించాలండిబాబూ, లేకపోతే నే నటుకాసి పోనండి.

జయ.—సరే క్షమించితిని, కాని యెట్టిశుభకార్యములకుగాని, అశుభ కార్యములకుగాని ఆమత్తుపదార్థములు వర్జనీయములు కాబట్టి నీవు యెన్నడును అట్టిపని చేయకుము పొమ్ము, (నర్సుడువెడలిపోవును) పాపము. ఈపంచములు దురాచారములకు లోనై వారిస్వాతం త్ర్యమును వారలే నశింపజేసుకొనుచున్నారు. వీరలకీ నీచదశను బాపి సన్మార్గముల నలవడజేసి సర్వమానవుల సఖ్యతజేయుటకై భగవాను డెప్పుడవతరించునోగదా. (బిక్షుకుడువచ్చి నమస్క రించిపోవును)

తులసి.—(ప్రవేసించి) యేమిజేయుచున్నారు. కొలదికాల మీభాగ వత కాలక్షేపమునకు (పైకిచూచి యులికిపడి) బజారున వేమా కలకలము.

జయదే.—(నిదానముగా గమనించిచూచి) యేమియునులేదు. ఆ ముందువచ్చు పిచ్చివానివెంటబడి పిల్లలుఅల్లరిజేయుచున్నారు. అతడును నిటేవచ్చుచున్నాడు. (పరికించిచూచి) తులసీ అతడు

పిచ్చివాడు మాత్రము కాడు. పరిశీలింపుమా మొగమునందలి తేజము. (గుడ్డపేలికలు ధరించి మలినదేహముతో వేంకటరావు అవధూతవేషమున ప్రవేశించును) ప్రేయసీ. అతడు పిచ్చివాడు మాత్రముకాడు. భగవానుని సందర్శించిన యవధూతయైయుండ వచ్చును. (జయదేవుడు అవధూతను సమీపించి వానిపాద ములపైబడును.) అయ్యా! యీదీనుని గృహమునకు దయచేసి ఆతిథ్యమంగీకరింప ప్రార్థింపుచున్నాను. (మౌనముతో అవధూతవచ్చు ను. తులసీ జయదేవులు భక్తితో కొన్నిపండ్లనీయ తిని మౌన ముతో అవధూతలేచి వెడలబోవుడు) స్వామీ! యీదీనుని గృ హమున కొంతవరకు విశ్రమించి పావనము జేయ ప్రార్థింపుచు న్నాను (వినిపించుకొనక అవధూత వెడలిపోవును.) దేవీ, ఇతడు తప్పక అవధూతయే సందియములేదు. అదియునుగాక పూర్వ మొకప్పుడు యెచ్చటనో నేను జూచినట్లే జ్ఞప్తియుండెను. ఆ మహానుభావులు, అదుగో ఆచెట్టుదరికేగుచున్నారు. నేను వారిని మరల భోజనవేళకు దీసుకొని వచ్చెదను. నీవు త్వరగా వంట జేయుము. (కూర్చుండును. తులసి లోనికేగును. ప్రసాదరావు ప్రవేశించి జయదేవునకు నమస్కరించును.)

జయ—అయ్యా తమదేగ్రామము.

ప్రసాదరావు—మాది పోలవరము, నాపేరు ప్రసాదరావు.

జయ—తమరేపనికై వచ్చితిరో యడుగవచ్చునా.

ప్రసాద—అయ్యా, పూర్వము, మాగ్రామమునజరిగిన కూనీకేసునకు సంబంధించిన విషయములు మీరెల్లరెరిగిన వేగదా. ఆకేసునకు సం బంధించిన నాగమణి యనునామె, గురూపదేశమందిన వెనుక, గురువుసలహాపై మారుటికొమరుడైన వేంకటరావును దేశభ్రష్టుని జేసి భర్తనుజంపి తత్పాపఫలము జయిలునందే యనుభవింపుచు నశించినది

జయ—అయ్యా ఈవిషయములన్నియు నాకును తెలిసియేయున్నవి. తదనంతరవృత్తాంతము జెప్పుము.

ప్రసాద—ఆజయిలునుంచివచ్చిన, గురువు, లక్ష్మమ్మ, రంగారావు, గంగమ్మలు, పూర్ణపశ్చాత్తాపమొంది ఈదొంగ గురునాటకమున వచ్చు నవర్థకములను ప్రజలకుబోధింపుచు, వేమనాశ్రమ మొండు గట్టించి, అవధూతయైన మా వేంకటరావును, ఆ యాశ్రమమున కొక్కపరి రప్పించగోరి అందులకై నన్ను నియోగించినారు.

జయ—(స్మృతినభినయించి) ఆహా, యేమినా భాగ్యము. పూర్ణగ్రహస్థధర్మములు నెరవేర్చితినను మాట నేడుగదా సాఫల్యమైనది. ఒకానొకప్పుడు నాకు శిష్యతుల్యుడును, నేడు సచ్చిదానంద స్వరూపుడును అగు వెంకటరావు స్వయముగా నాయింటికివచ్చి నన్ను పావనునిగా జేసెను. ప్రసాదరావుగారూ, ఆపవిత్రహృదయుని లక్షణములు నేనాదిలోనే గ్రహించితిని. అంతియేజరిగినది.

ప్రసాద—(ఆతురతతో) అయ్యా మాఅవధూతమీకెచ్చటనైన గనుపించెనా యేమి?

జయ—యెచ్చటనో దర్శనమిచ్చుటకేమి? నేడు స్వయముగా నాయింటికివచ్చి నన్ను ధన్యునిజేసినాడు

ప్రసాద—(ఆశ్చర్యాతురలతో) అయ్యా వారున్నప్రదేశమును నాపై గలప్రేమచే, ఒక్కసారిజూపిన, నెనెట్లో శతవిధముల ప్రాధేయపడి మా వేమనాశ్రమమునకొక్కసారి తోడ్కొనిపోయెదను.

జయ—ప్రసాదరావూ, ఆమహాసీయుడు ప్రకృతి విలక్షణుడుసుమా?

ప్రసాద—అయ్యా నాప్రార్థనబలముననో, వేమనాశ్రమ, మహత్వము వలననో, మీ సంపూర్ణదయాతిరేకముననో, తప్పక వారిని తోడ్కొని పోగలనని యొండి నమ్మకమున్నది, పూజ్యులగు మీదంపతులుగూడ మాయాశ్రమమునకువచ్చి మమ్ము ధన్యుల జేయుదురని నమ్ముచున్నాను.

జయ—అయ్యానాకింతకన్న గావలసిన దేమున్నది. వారున్నపవిత్ర ప్రదేశమునకు బోదముర మ్మ్.

ప్రసాద—నడువుడు. (ఇరువురు వెళ్ళుచుండగా తెరపడును.)

—:O:—

## తృతీయ రంగము.

—§ రాజవీధి §—

(తులసీజయదేవులు అవధూత ప్రసాదరావులు నిలువబడియుండ గురువు, లక్ష్మమ్మ, గంగమ్మ, రంగారావులు అవధూత కాళ్ళపై బడియుందురు)

ప్రసాద—అయ్యలారా ఇప్పుడు మీరు మెట్టి దుఃఖమును వెలిబుచ్చినను ప్రయోజనములేదు. వీరు పూర్వము మన వేంకటరావుగారేకాని ప్రస్తుతము అచల పరిపూర్ణావధూత స్వాములవారు. వీరికి శత్రుమిత్రులు. లాభనష్టములు సమానములే. వీరికి మన పశ్చాత్తాపములును దుఃఖములును ప్రార్థనలును చెవికెక్కవు. వీరి నిచ్చటికెరప్పించుటయే మహాకష్టమైనది. వీరు ఇప్పుడే వెడలిపోయినను పోవుదురు. కానత్వరగా ఆశ్రమమునకు తోడ్కొనిపోయి వీరిపాదధూళిచే అస్థలమును పావనముజేయించుటే మన కర్తవ్యము. మీరువీరికి క్షమాపణముజెప్పుటకు మారు, ప్రజలకు మీయనుభవమును పశ్చాత్తాపపూర్వకముగా నివేదించి లోకముచే క్షమాపణముబొంది ఈకలికాలశుష్కవేదాంతుల భూమిపై నశింపజేయుటయే యుక్తమైనకార్యము. (పాదములపైనుండిలేచి అందరు) అయ్యా అందులకు సిద్ధముగానున్నాము.

గురువు—సిద్ధమేగాదు అందులకిప్పుడే అవతరంభించుచున్నాను.

సీ॥ గురుదక్షైధనమును ♦ గూడబెట్టగనెంచి
వేదాంతగ్రంథము ♦ లెన్నొచదివి
నాన్నగారనుమని ♦ నాతికిబోధించి
దేశదేశములెల్ల ♦ తిరిగితిరిగి
పైకమిచ్చిరియొలేక ♦ పరిపూర్ణమిచ్చిరో
పల్లెకొక్కనిలెక్క ♦ బట్టుకొనుచు
గారెబూరెలతోడ ♦ గౌరవంబుగబెట్టి
ధనములిచ్చెడివారి ♦ దరికిజేర్చి

గీ॥ భోగములబొంది భువినినా ♦ బోతుపగిది
కన్నుగానక దిరిగియు ♦ ఖైదునబడి
కష్టముల నందుచుంటిని ♦ ముష్టికొరకు
మాయగురు వేషముల నింక ♦ మానుకయ్యు
స్వానుభవమిద్ది వినుడు యో ♦ సరసులార

సీ॥ మోక్షమిత్తునటంచు ♦ మోహింపగా జేసి
మాయ జేయగజూచు ♦ మందులార
ఉపదేశముల టంచు ♦ యుఋనీతులన్నల్కి
పాదపూజలుగొను ♦ పందలార
మూడు పూటలుమెక్కి ♦ ముదితల దరిజేరి
కందార్థములుబాడు ♦ గాడ్దెలార
పరిపూర్ణమిచ్చెద ♦ పైకమిండనిగోరి
నిలువజేయగజూచు ♦ నీచులార

గీ॥ ఎన్నిదినములు జరుగునో ♦ వెంగళప్ప
లార, మానుడు, యికనైన ♦ గురునివేష
ములను వీడుడుమంచిదా ♦ బుద్ధిగలిగి
మెలగుడికస్వానుభవమిద్ది ♦ మిత్రులార॥

రంగా—
ఓ దొంగ వేదాంత గురుబిడ్డలార, వినండి.

సీ॥ గురుబిడ్డలుగజేరి ♦ పరులనువంచించి
ధనములార్జించెడి ♦ చెనటులార
భాగంబులనుగొన ♦ భ్రష్టులౌగురువుల
గొప్పజేయు దరిద్ర ♦ గొట్టులార
నియమమింంచుకలేక ♦ నిష్టలజెప్పుచు
వంచించి తిరిగెడి ♦ వధ్యులార
ద్రవ్యంబు కొరకునై ♦ ధర్మంబువిడనాడి
ముదితలజేర్చెడి ♦ మూర్ఖులార

గీ॥ ఆకులనునాకి యాకలి ♦ నాపుకొనెడు
నీచయాచక వృత్తియే ♦ నీకువృత్తి
మించునని యెంచి వేగ త్య ♦ జింపుడింక
మాయశాస్త్రపువృత్తినో ♦ మందులార
స్వానుభవమిద్ది వినుడు ఓ ♦ సరసులార॥
సీ॥ ధనముగడింపగా ♦ దాగిమంచిదటంచు
గురుబిడ్డలుగ జేయు ♦ కుమతులార
గురుబిడ్డలమటంచు ♦ నురుసీతులంబల్కి
దేశముల్ దిరిగెడి ♦ దెష్టులార
దేశముల్ దిరుగుచు ♦ దీనవితంతులకు
మోసగించెడియుండ ♦ మోపులార
మోసమేపొట్టకు ♦ గ్రాసంబుగానెంచి
పాపమేమెనటంచు ♦ భ్రష్టులార
గీ॥ ఎంతకాలముమీరలీ ♦ విధమునందు
నుందురోయంతదనుకను ♦ నుర్విభార
మింతదనుగదు వినరయ్య ♦ మిత్రులార
స్వానుభవముగ దెల్పితి ♦ సరసులార॥

లక్ష్మమ్మ—భర్తసేవలువిడచి పరపురుషులసేవింప నిచ్ఛగించు ఓ స్త్రీ
జనములారా ఆలకించండి!
సీ॥ తాజెడ్డదేగాక ♦ తరుణులనెల్లర
చెరుపగాజూచెడి ♦ చెడిపెలార
కొత్తవాడేతేర ♦ గురుబిడ్డడితడని
పాదసేవలుజేయు ♦ పాపులార
గంజాయినిచ్చిన ♦ ఘనమనిగురులకు
పతినినిచ్చెడి మూర్ఖ ♦ భామలార
మత్తుచేవాగిన ♦ మాటలేఘనమని
యుబ్బిగంతులువైచు ♦ యువిదలార.

గీ॥ గురువులావారు కానన ♦ తపసులుగాని
యోగులావారు సన్యాసి ♦ జోగులగుదు
రంతియేగాని వారలు ♦ భాగ్యులనుచు
పలుకగారాదు మీకు నో ♦ పడతులార

సీ॥ భర్తలగాంచిన ♦ భగభగమండి
చెడు దేశికుల జేరు ♦ చెడిపెలార
భర్తల మోమును ♦ పరికింపనొల్లక
పరుని పూజలు జేయు ♦ పాపులార
భర్తల మాట ద ♦ బాయించి నీచుల
యాజ్ఞానువరులౌ ♦ నధములార
భర్తకునుపచార ♦ పనులు చేయక యుండి
సన్యాసులనుగొల్చు ♦ చవటలార

గీ॥ భారతస్త్రీల భాగ్యంబు ♦ పతియెగాన
భర్తమాటకుజనదాట ♦ పాతకంబు
గానగురువులవిష్ణుడో ♦ కాంతలార
వరుడు గురుడగుగాదె ♦ నీవసుధలోన

గంగమ్మ—భర్తజచ్చినంతనే పరపురుషుడని శంకింపక, మాయదేశి
కుల సేవించునో మందబుద్ధులారా వినుడు

సీ॥ వేదాంతులనవి ♦ వేకులంచనియెంచు
విజ్ఞానహీనులౌ ♦ వెఱ్ఱులార
పరిపూర్ణమన నేదో ♦ భావంబసిదలంచు
నజ్ఞానధనులగు ♦ నధములార
గురు లేదో మోక్షంబు ♦ గూర్తురంచెంచెడి
సిగ్గువీడినయట్టి ♦ చెడిపెలార
కందార్థములెగొప్ప ♦ కైవల్యమనియెంచి
పఠియించుచుండెడి ♦ పశువులార

గీ॥ ధరనుమానవజన్మను ♦ దాల్చినందు
కిట్టులామీరు శేయుటో ♦ యింతులార

శుష్క వేదాంతులిలపైన ♦ శక్తిపోవ
తపముజేసితరించుడో ♦ తల్లులారా

(అందరును ముందుకు రెండడుగులువేయుగా తెరలేచును వేమనాశ్రమము కనుపించును అందుకొందరు జనులు, మధ్యవేదిక సమర్చబడియుండును.)

ప్రసా-సక్రమగృహస్తధర్మ నిర్వాహకులును, నిరంతర శ్రీమన్నారాయణుని పాదభక్తులును అయిన శ్రీజయదేవులు పరమార్థ తత్వమునుగురించి విపులముగా సెలవిచ్చెదరుగాన యెల్లరును శ్రద్ధతో వినగోరుచున్నాను. (జయధ్వనులు చెలరేగుచుండ జయదేవుడు లేచి వేదికదగ్గర నిలవబడును.)

జయ—సోదర సోదరీమణులారా! సన్మార్గ సద్ధర్మ స్వరూపులారా! పరమార్థతత్వమును నిర్ణయించు యీసమావేశమునకు కించిజ్ఞుడగు నన్ను అధ్యక్షునిగా నియమించి నాతలపై అఖండభారమును వైచియున్నారు. నాకీ సమస్యను విమర్శింపజాలు జ్ఞానము లేకపోయినను సోదరులగు మీకోరికను నిరాకరింపజాలక యీ భారమును అంగీకరించితిని. ప్రస్తుతము మనము తెలుసుకొన సమావేశమైన యీమహాసమస్యను విమర్శించుట మహాభారమైనది. కారణమేమన, మహాపండితులు అనేక సూత్రముల నాధారము చేసుకొని అనేకమార్గములు బోధించుచూ ఇది యిదమిద్ధమని మనబోటివారు తెలుసుకొనలేని స్థితిలో మనల దింపియున్నారు. గాన యీవిషయము మహా భారమైయున్నది. కాబట్టి సత్యపదార్థము తెలుసుకొన ఆత్మకంటె వేరొండు సూక్ష్మమార్గములేదు. అందులకే "ఆత్మబుద్ధిః సుఖంచైవ" అని ఆర్యులుచెప్పియున్నారు. గాన యీవిమర్శింపబడు విషయములో నా అంతరాత్మ ప్రబోధమును, నా అనుభవమును,మీయెదుట విశదీకరించెదను. మీరలును సూక్ష్మదృష్టితో నందలి సత్యాసత్యములను దెలుసుకొని తదానుసారముగా ప్రవర్తింపవలయునని మనవి చేసుకొనుచున్నాను.

సర్వశాస్త్రముల సారమేమని మన మాలోచించిన కంటికి కనుపించునదియును, బుద్ధిచే నూహింపబడునదియును నశించునవియే అగుచున్నవి. గాన యీప్రకృతి వస్తువులపైగల ప్రేమను అవస్తువులనుండి మరలించి పరమాత్మ తత్వముపై నిలుపుటయే నిశ్చలభక్తి యనబడును. కంటికి కనుపించువస్తువులపై ప్రేమ కుదురుననుట అనుభవనీయమే గాని, కంటికి కనుపించనట్టియు బుద్ధికి వూహింపబడనట్టియు వస్తువుపై ప్రేమకుదురుటెట్లు? ఎన్నడును కలనైన దర్శించని వస్తువును ప్రేమించి యెట్టివారైన దానికై పరితపింతురా యని సందేహము కలుగవచ్చును. ముందు యీకనుబడనివస్తువు కలదా? కలిగిన యీభిన్న మతములలో యేమతమందు ఆపరతత్వముగలదు అనునది సిద్ధాంతము చేసి అటుపిమ్మట కనుబడని వూహింపబడని ఆ పరమాత్మను యెట్లు ప్రేమించగలము అనునది వితర్కింతము. కంటికి గోచరించనట్టిదియును, మనస్సుచే వూహింపబడనట్టిదియును సనాతన మైనట్టిదియును నకవస్తువు కలదా? కలదు. యీచరాచర ప్రకృతి నొక్కసారి బుద్ధిచే ఏకాంతమున వూహించి విమర్శించి అనుభవమును గాంచిన యీవిచిత్ర ప్రకృతి చిత్రములను భూమ్యాకాశాది పంచభూతముల నియామకమును సృజించు అనంతశక్తి వక్కటున్నదని ప్రతివాని హృదయమున గోచరించును. ఆమనస్సుచే వూహింపబడినదానినే మహాత్ముడు అచింత్య అద్భుతానంద శక్తియనియు, బుద్ధుడు నిర్వాణమనియు, శంకరుడు అద్వైతమనియు, రామకృష్ణ శక్తియనియు, వైష్ణవులు విష్ణువనియు శైవులు యీశ్వరుడనియు, మరెన్నియో నామములచే వ్యవహరించుచున్నారు. ఆపరమాత్మ తత్వము యిందేనామము కాకపోయినను యీప్రకృతి నిర్మాణశక్తి మాత్రము ఒక్కటున్నదని అందరును వప్పుకొనవలసినదే. ఆపరతత్వమందు మన ఆత్మను లగ్నముచేయుటయేశాంతి అనగా ముక్తియని అనేకమంది అనుభవనీయులు విశదీకరించి చెప్పియున్నారు. ఆపరమాత్మ తత్వ

మును త్వరలో తెలుసుకొనుటకు మన కేమతధర్మము లాదర్శ ములైనవని ఆలోచించిన వేరువేరు నామములచే వ్యవహరింప బడుచున్న యీమతధర్మములన్నియు చివరకొక్కలక్ష్యము నేచూపుచున్నవి. ఈమతగ్రంథములన్నియు సత్యము, భూతదయఅనగా అహింస బ్రహ్మచర్యములనుఆచరించుచు ఆపరమాత్మ తత్వమును గనుగొనుము అనియేగదా చెప్పుచున్నవి. కాబట్టి యేపేరుతో వ్యవహరింపబడుచుండినను అన్నిమతముల ప్రధానధర్మములు నొక్కటిగానే వాకొనుచున్నవి. కాబట్టి మనకేమతమైనను బాధలేదు. గాన, మనము మతములకై వాదులాడుట కేవలము వెర్రి, అని యిప్పటికి తేలినది. యిక సత్యము. అహింస మొదలగు ధర్మముల నాచరణీయము గా సద్ గృహస్థధర్మముల నాచరింపుచున్నను ఆపరమాత్మతత్వములో మన ఆత్మను ఎట్లు లగ్నము చేయుట అనునదియే ప్రధానసమస్య. కాబట్టి యిక నావిషయమును విమర్శింతము. మన ఆత్మను ఆపరమాత్మయందు యెట్లు లగ్నమగుచున్నదో తెలుసుకొనుటకే కొందరు మహానీయులు సర్వధర్మముల పరిత్యజించి జీవబ్రహ్మైక్యసంధానమును గ్రహించి వారి అనుభవమును ప్రజలకు దెలియజేయుచు ముక్తిపొందినారు. అట్టివారినే గురువులనియు స్వాములనియు పరమహంసల నెడి పేర్లిడి వారి నామమును స్మరించుకొనుచూ వారి ఆజ్ఞానువర్తులై అనేకులు అట్టి శాంతిపదమును పొందినారు. ఆపరతత్వమార్గానువర్తులగు మహాస్వాముల కీర్తినిగాంచియే వారివలె కీర్తిని మరియు ధనభోగములబొంద నిచ్ఛచే వాచాజ్ఞానమును సంపాదించి ఆచరణశూన్యులగు గురువులు గ్రామగ్రామమునకనేకులు కుక్కగొడుగులవలె నేడు బయలుదేరినారు. యీతుచ్ఛగురువుల మాయలంబడక అనేకులు హేళనగా చూచుచున్నను కొందరింకను వారి పాదసేవలుచేయుచు లోకమున విచ్చలవిడిగా తిరుగుచున్నారు. ఆజీవైక్యసంధానమును అనేకులు తేటతెల్లముగా ఇదివరకే తెలిపియున్నారు. అందు రామతీర్థ ఇట్లు చెప్పియున్నాడు.

పశితనమున తల్లి స్తనమునుమాత్రమే ప్రేమించి కొంచెము ఎదిగిన వెంటనే స్తనముల నిరశించి ఆటలను ప్రేమించి మరి కొంత కాలమునకు అల్లే ఆటల నిరసించి విద్యను ప్రేమించి అల్లే మరి కొంతకాలమునకు వక స్త్రీని ప్రేమించి అటువెనుక ఆ ప్రేమను శిశువులపైనుంచి చివరకు దీర్ఘవ్యాధిపడి బాధపడుచు యీ ప్రాణము పోయిన సుఖపడుదునుగదాయని శరీరము సైతమును నిరసించుచున్నాడు. దానినిబట్టి ప్రేమ వస్తువులలోనుండదనిన్ని మనలో గల ప్రేమను కాలానుసారముగా నాయావస్తువులపైనుంచి మరలించుకొందుమనియు గాన, మనలోగల ఆ ప్రేమతత్వమును గ్రహించి నా ప్రేమను నీవస్తులపైనుండి మరలించి ఆపరతత్వమందు నుంచుటయే శాంతి అనగా ముక్తి అని తెలిపియున్నారు. కాబట్టి నాలుగు ఆశ్రమములలో మొదటిదగు బ్రహ్మచర్యాశ్రమమునందు జయముగాంచి, పవిత్రమగు గృహస్థధర్మము స్వీకరించి పవిత్రగ్రంథమును సర్వగ్రంథసారమును అగు గీతయందలి అర్థమును గ్రహించి తదానుసారముగ నిష్కామకర్మచే గృహస్థధర్మముల నాచరించుటయే మనకు ముఖ్యకర్తవ్యము. కొందరు సన్యసించితిమని శిష్యులచే సేవలుచేయించుకొనుచుండు సన్యాసులుకలరు. వారలు వట్టిదంభులు. వారినిగురించి మహాత్ముడు యిట్లుచెప్పియున్నాడు. యీ సన్యసించితిమనువారలు వారి భోజనపానాదులకర్మలలో పాల్గొందురుగాని, యితరుల సేవయను కర్మలలోమాత్రము పాల్గొనరు అని చెప్పియున్నారు. దీనినిబట్టి వారి దుర్నడతలు తెల్లమగుచునేయున్నవి. కావున సోదర సోదరీమణులారా! సక్రమగృహస్థధర్మముల నిష్కామముచే చేయు పురుషుడును, పతిభక్తిగలిగి పతియే దైవముగా భావించుచు పతిచే జరుపబడు సమస్తకర్మలయందు భాగినియై ఆయాకాలములలోగలఅవతారపురుషుల ఆజ్ఞల శిరసావహించి అనుసరింపుచు మోక్షప్రాప్తి చెందవలెననియు యీదుర్దేశకులజేరి చేయు దుష్టవర్తనుల మానవలసినదనియు మనవిచేయుచు యింతటితో విరమించు

(అర్థోక్తిలో)

విధవరాలు—అయ్యామీరలు చెప్పునది బాగుగనేయున్నది. భర్త గలస్త్రీలు భర్తలపూజించిన భర్తలేని స్త్రీలుమేల గురువుం చేర రాదు.

జయ—అమ్మా ఏస్త్రీయు, పరపురుషుని పాదపూజలు చేయ దు పోనీ, నీమాట చే వింద ము. నీవొక గురువును సేవింపుచుంటివను కొనుము అతడుచనిపోయిన నేమిచేయు వు.

విధవరాలు—ఆగురుదేవుని పటమును యింటిలో పెట్టుకొని పూజింపుచూ ఆగురుసమాధికి పూజలు చేయుచుందును?

జయ—వ్రూతల్లీ! ఆగురువు చచ్చినచో వానిపటమును పూజింతువుగాని, నీభర్తపటమునుమాత్రము పూజింపవు. చివరకు వాని పేరేని స్మరింపవు కారణమేమి?అగ్నిసాక్షిగాస్వీకరించిన భర్తకంటెగురువుల ఎక్కువవేమి? ఏమియులేదు. ఇదివృత్తబయులు అనియేనా ఇంకేమైన జెప్పెనా? ఏమియు లేదు ఇవి వృత్తబయలు అనిచెప్పినవాని పటమును లేకపాదములను భక్తిగా పూజింతువుగాని నిన్ను స్వీకరించిననాటనుండి యెన్నియో ఉత్కృష్టధర్మముల తెలియజేయుచు, మరియు నయభయములు చూపుభర్త పాదముల, చివరకు నామమైన స్మరింపవు ఓమహాతల్లులారా యీదొంగకు యుక్తుల విడచి సక్రమమార్గముల నడచుకొందురుగాక.

ప్రసాదరా—అయా యుగపురుషులచే చెప్పబడు నాధర్మముల నెరవేర్చుచు గృహస్థ ధర్మముల నెరవేర్చుడని సెలవిచ్చిరి. నాధర్మములకూడా విశదీకరింపగోరుచున్నాను.

జయ—భరతఖండమున యుగయుగమున మహాత్ము లవతరించి ధర్మములు బోధింపుచునేయున్నారు. గాని వర్తమాన కాలములో యే మహాత్ముడు ధర్మములుబోధించునో వానినే మనమందర మనుసరించవలయును. పూర్వమహాత్ముల ఆదర్శముల మనమేల అనుసరింపకూడదనిన ప్రతికాలమునకు ధర్మములు మారుచుండునుగాని సత్యము అహింస మొదలగు సత్పదార్థములు మాత్రము యెన్నడు మారజాలవని యిదివరకే జెప్పియున్నాను. కాబట్టి యి

హాపనములకు దారినిచ్చు మార్గములు జెప్పు మహాత్ముని ఆదర్శము లతో మనమనుసరించుచూ నుండినమంచిది.

మనమనుసరింపదగినవియు, సత్యమైనవియు అగు యీ ధర్మములతో మెలగుచుండవలయును.

1 సత్యము—మనోవాక్కాయముల చేతను అబద్ధమాడకుండుట.
2 అహింస—యేజీవికేని హింసజేయకుండుట.
3 బ్రహ్మచర్యము—సక్రమ గృహస్థధర్మము స్వీకరించి యేకపత్నీవ్రతస్థుడై యుండుట.
4 ధ్యానము—నిర్మలమైనమనస్సుచే ధ్యానించుట. దేనికి ధ్యానమన శాంతికే అనగా మనస్సున కంటుకొన్న వ్యామోహమును వదలించుకొని నిర్మలముగానుండుటకే యీ ధ్యానమునకు మంత్రతంత్రములు కావలయునని భ్రమపడరాదు. దీనికి పరికరము నిర్మలత్వమే. యివే జీవత్వమును వృద్ధిజేసి పరతత్వమునందు ఐక్యముజేయుటకు సత్యమార్గములు. యిక ఒకపనిజేయ బూనినచో పరికరణ మెట్లవసరమో అట్లే ఆత్మాభివృద్ధికి యీ శరీరారోగ్య మవసరముగాన.

1 ప్రాతఃకాలమును, సాయంకాలమును స్నానముచేయుట.
2 చుట్ట, బీడి, మొదలగు మత్తువస్తువుల విసర్జించుట.
3 మత్తునిచ్చునదియు తామసగుణ మిచ్చునదియు అగు పదార్థముల విసర్జించి అనగా మత్స్య మాంసములు కారము, మొదలగునవి వీడి సాత్వికాహారమే భుజించుట. సాధ్యమైనంతవరకు మితభాషిత్వము.
4 అవకాశమున్న ఆసన, ప్రాణాయామాదులు అభ్యాసముజేయుట.

యివి శరీరారోగ్యమునకై ముఖ్యముగా నాచరింపవలయును. యిక ఒకవిషయముమాత్రము ముఖ్యముగా గమనించి ఆచరింపదగియున్నది. అదియేమన, అఖండమైన పరమాత్మతత్వమునుండి ఖండమైనదే యీఆత్మ అనియు, యీఆత్మను కష్టములనైనను లెక్కించక ఆపరమాత్మయందు మిళితమగుటకై యెట్లునీవు నిష్టలతో కషిం

పుచున్నారో ఇట్టి యింకోటి జేయవలసియున్నది. భూ మ్యాకాశాది పంచభూతముల కలియుకయే ప్రకృతియనియు ఆ పంచభూతముల కలియుక చేతనే యీ శరీరమగుననియు మనమెల్లర మెఱుఁగవలసినదే. ఆ ప్రకృతి ఆధారముచేతనే యీ ప్రకృతి శరీరము నిలువ గలిగినది యీప్రకృతి యిచ్చు ఆహారము చేతను, యీ ప్రపంచము నందలి సమస్త ప్రాణుల సహాయము చేతను మనము జీవింపుచున్నాము. మరియు యేపనియైనను జేయఁగలుగుచున్నాము. అనగా, ఆత్మకు, పరమాత్మకు ఎట్టి బాంధవ్యముగలదో, ఆ బ్రహ్మాండ ప్రకృతికిని మన యీ పిండ ప్రకృతికిని అట్టి సంబంధమే యున్నది. పర మాత్మ లేకున్న, ఆత్మయెట్లు లేదో అట్లే యీ కనబడు ప్రకృతి పను లాగిన మన శరీరపనులును ఆగును. దీనినిబట్టి ఆత్మాభివృద్ధికి పర మాత్మ నెట్లు సేవింపుచున్నామో, అట్లే యీ పంచభూతమిళితమైన శరీరాభివృద్ధికి ఆ పంచభూత కలియిక యగు ప్రకృతిని సేవింపవలయు ను. అనగా లోక సేవజేయవలయును. ఎవరో స్వాభిమానులకును సో మరులకును తప్ప యీ యెడమందరకు తేటతెల్లమగుచునే యున్నది. పునరుక్తిదోషమైనను, తేటతెల్లముగా తెలియుటకు మరియొకపరి తె లుపుచున్నాను. నిజమైన వేదాంతి అనగా జ్ఞాని లోక సేవ జేసి తీరవల యును. లేనిచో వాడు ప్రకృతికి ద్రోహియగు ఒక పశువని చెప్పనగు ను. గాన మన సిద్ధాంతములో యీపదము జేర్చుచున్నాను.

5 ప్రజ సేవకై తన శరీరము నుపయోగింపవలయును. పై తొమ్మిది నియములతో ప్రవర్తిల్లెడివాడే సాధువు, అట్టివాడే మానవుడు.

ప్రసా—అయ్యా అట్టిధర్మములతోనే యీ ఆశ్రమము నడిపెదము. కాని ఆసంఘములకు వేమనసాతసంఘములని పేరిడెదము.

జయ—పేరేదైన పెట్టుడు. ఆదర్శములవియే యుండవలయును. పేరు ప్రధానముగాదు.

ఒకడు (లేచి) అయ్యా! యీ ఆశ్రమమునకు మా ప్రసాదరావునే పూజారిగానుంచి, వారిఆజ్ఞలలో మేమందరము మెలగుచు పై త

దర్భముల నెరవేర్చుచుందురు.

జయ—మంచిది (అందరు చప్పట్లుకొట్టుదురు.) వేమనార్యుని విగ్రహమునకు, తులసీదేవి హారతి యిచ్చుచుండ)

ప్రసా—సీ॥ జయదేవురీతిగా ♦ జనులెల్లనీతితో
ధరణిగృహస్థులై ♦ వరలుగాత

గంగ—తులసీయువిద ప్రాలై ♦ సతులెల్ల పతిభక్తి
గల్గిగారవకీర్తి ♦ గాంతుగాత

లక్ష్మ—కులటలైసన్యాసి ♦ గురువులసేవించు
సతులు భూలోకాన ♦ సమయుగాత

గురు—వేంకటరాయుని ♦ విధముగాభక్తాళి
నిఖిలమండలముల ♦ నిండుగాత

జయ—గీ॥ మాయమతములు భువిలోన ♦ మగ్గుగాత
తులసీ— నీతిధర్మంబు ప్రజలలో ♦ నిలచుగాత
అందరు—కవులువర్ధిల్లి జయముతో ♦ గ్రాలుగాత
భరతమాత జయంబును ♦ బడయుగాత.

---

# అనుబంధములు

## —* 1 వ అనుబంధము *—

ఎదుకులకాంభోజిరాగం—ఆదితాళం.

ఆహా బ్రహ్మాండమైనది ఆదిమంత్రమూ । మనగురువుగారు
చెప్పినదొకటి పెద్దమంత్రమూ ॥ఆహా॥

1 రెక్కముక్కలేనిపక్షి రేయింబవలు తపసుచేసీ
ఒక్కచెరువుచేపలన్ని ఒక్కట్రమింగెనురా ॥ఆహా॥

2 యింటివెనుక తుట్టెపురుగు । యింటిలోనందర్రమింగ
చూడవచ్చిన జనులునెల్ల చూచిమింగెరా ॥ఆహా॥

3 కాళ్ళుచేతులులేనివాడు । కడవముంత చేతబట్టి
నిండుబావినీళ్ళుఅన్ని । ఒక్కడేముంచెనురా ॥ఆహా॥

4 యేటిమీదసాతికొంగ । వేటలాడుచునురాగా
చాటునున్న మీనపిల్ల । అట్టిదిగమి గెనురా ?ఆహా॥

—* 2 వ అనుబంధము *—

నాదనామక్రియ—యేక తాళం

**వల్లవి**-ఎంతమంచి గురుడు దొరకెనే । ఓ అమ్మలారా యెంతమంచి॥
**అనువల్లవి**-ఎంతమంచి గురుడుదొరకె । అంతరంగమందునన్ను । చింత
లేక గురుని పాదము చెంత జేరియుండుమనెనె ॥యెంత॥
1 కన్నులు వీనులుమూసి । గాలిరాకపోక తెలిసి
పున్నమ వెన్నెలబైట । కన్నదెరచిచూడుమనెనె ॥యెంత॥
2 పంచకోశంబులుబాసి । పంచముద్రలన్నిరోసి
పంచవింశతి తత్వమూవల । జట్టుబైలున జేరుమనెనె ॥యెంత॥

గురువు పాట.

—* 3 వ అనుబంధము *—

సౌరాష్ట్రి—చాపుతాళం.

**వల్లవి**-చెప్పెద గురుమహిమ । తెలిసినంతట మీరు తెలుసుకోండీ
విప్పిచెప్పగ నేనెంతటివాడను । శరణంటినీ ఒప్పుకోండీ ॥చె॥
1 చింతమానుమీద చేమంతిపూసెనూ । తెలుసుకోండీ
ఆచేమంతిమీదను చెంగల్వపూసెనూ । తెలుసుకోండీ ॥చె॥
2 భూరుహంబునరెండు । పుట్టలుగలవయ్యా తెలుసుకోండీ
ఆపుట్టలలోరెండు పెనుబాములున్నవి । పట్టుకోండీ ॥చె॥
3 పట్టుకొనినమీద వైగా రెండుగ్రుడ్లు । తెలుసుకోండీ
ఆగ్రుడ్లమీదవృక్ష[illegible]కూర్చున్నది । తెలుసుకోండీ ॥చె॥
4 మూడుమూలలపెట్టె । [illegible]లేదీసేనేర్పు నేర్చుకోండీ
అమూతదీసితెపెద్ద భూతమగుపడును । తెలుసుకోండీ ॥చె॥
5 తెలిసినవారికి తేనెమామిడిపండు । తెలుసుకోండీ
తెలియనివారికి విషముష్ఠిపండని । తెలుసుకోండి ॥చెప్పెద॥

—♦ సంపూర్ణము. ♦—

